# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

రెండో సంపుటం



కథలు

ఇల్లుపట్టిన వేధవాడబడుచు

ప్రకాశకులు

కలాభివర్ధనీపరిషత్తు

రాజమహేంద్రవరం

# పోషకులు

మ॥ రా॥ శ్రీ తూములూరి శివరామయ్య పంతులుగారు

బి. ఎ., బి ఎల్. హైకోర్టు అడ్వకేటు నెల్లూరు.

,, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు

ప్రొప్రయిటరు : వావిళ్ల రామస్వామి శాస్త్రులు

& సన్సు మదరాసు

,, ద్వారంపూడి రామారెడ్డిగారు

భూస్వాములు అనపర్తి

,, ఏడిద వేంకటరావుపంతులుగారు

భూస్వాములు రామచంద్రపురం

,, ద్వారంపూడి వేంకటరెడ్డిగారు

భూస్వాములు అనపర్తి

,, బెజవాడ రామచంద్రారెడ్డిగారు బి. ఏ.

భూస్వాములు బుచ్చిరెడ్డిపాలెం

కీ॥ శే॥ సబ్బెళ్ల పద్దయ్యగారు

కొంకుదురు

,, కర్రి చినవేంకటరెడ్డిగారు

రంగూను

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

## ఇల్లు పట్టిన వెధవాడబడుచు

"ఒరేయ్ తమ్ముడూ"

సాయంత్రం అయిదు గంటల వేళ, గాది సావిట్లో, చలపతిరావు నెత్తిమీద చమురు పెడుతూ యిలా అందుకుంది బుచ్చమ్మ.

"పదిమాట్లు చెబుతుం దేమిటి యీపిచ్చిముండ అను కోకేం? నువ్వు చిన్నవాడవు. ఆటలూ పాటలూ తప్ప సంసారం అంటే యేమిటో యిప్పటికీ యెరగవు. నేనా పెద్దదాన్ని. పైగా, నాకు పిల్లా పీచా? అసలు మొగుణ్ణే యెరగ నైతిని. కనక, నాకు తమ్ముడ వయినా నువ్వే, కొడుకు వయినా నువ్వే, కూతురు వయినా నువ్వే. నలు సంత చెల్లె లయినా లేదు కదా? కనక, నాముద్దు ముచ్చ ట్లన్నీ నీమూలంగానే తీరాలి. అందుకోసం చెబు తున్నాను బాగా విను"

"...... ... ................"

"కానయితే, పంచశిఖులతో వృద్ధగానే నీను పెళ్ళి కావడం బాగానే వుంది; కాని, జోగమ్మ యింత గోరగా కాపరానికి వస్తుం దని మేమెవళ్ళమూ అనుకో లేదు. మొన్న మొన్నటి పిల్ల కాదుట్రా, తల్లివెంపు సంప్ర దాయాన్ని బట్టి అలా బొబ్బిల్లాగ వుంది కానీ; పదహా రేళ్ళు వెళ్ళాయో నిండాయోరా యింకానూ!"

"......................."

"ఇంతకీ: కోడలు కాపరానికి రావడం అమ్మ కళ్ళతో చూసుకుంది. ఒక్కగా నొక్క కొడుకు వయినా అమ్మకి ముచ్చట్లు బాగానే తీరాయి"

"......................."

"ముప్ఫయ్యెకరాల భూమీ, పెట్టిలాంటి యిల్లూ— చరువు లేకపోతే పోయింది, యేం లోటూ నీకూ? కాలి మీద కాలు వేసుక్కూచున్నా పది తరాల దాకా సరిపోతుంది. నీవాళ్ళకి గతి లేని వాడవా యేమిటి; యెండా వానా అనకుండా పుస్తకాలు మోసుకుంటూ యిస్కూళ్ళమ్మట తిరగడానికి?"

"......................."

"బతికి వున్నంత కాలమూ నిన్ను కనిపెట్టుకు వుం టాను కదా నేనూ? చూడు తమ్ముడూ! ఇల్లు పట్టాను.

నువ్వు నిస్సాకారంగా చూశా వంటే నా ప్రాణా లెగించి పోతాయి సుమా ! నీకు నేనంటే భయభక్తు లెక్కువే. ఆసంగతి నాకు బాగానే తెలుసు. అయినా, దిక్కుమాలిన అనుమానం అలా యేడిపిస్తుంది”

“........................”

“మన వంశంలో, మొగాళ్ళు పెళ్ళాలకి లొంగి వుండడం యెప్పుడూ లేదు. ఛా, అదేం బతుకు తమ్ముడూ? ఎక్కణ్నుంచో గాలికి కొట్టుకు వచ్చిన ఆడదా పెత్తనం చెయ్యడం ? మన తాతకి యిద్దరు రాడబడుచు లుండే వారుట. నాయనమ్మని వాకచోట కూచోపెట్టి యిల్లంతా వాళ్ళే నిర్వహించేవారుట. భోజనం చెయ్యడమూ, గుళ్ళోకి వెళ్ళి స్వాములవారి వుపదేశం వింటూ కూచోడమూ తప్ప యేమీ కలగచేసుకునేవాడు కాదుట తాతయ్య. సరే, నాన్న సంగతి నువ్వెరిగిందే కదా ? మొన్నమొన్నటిదాకా పెత్తనం అంతా అత్తదే కదా ?”

“........................”

“అత్త నన్ను కన్న కూతుర్ని చూసుకున్నట్టు చూసింది. సంసారరహస్యా లన్నీ నాకే చెప్పింది. పోతూ పోతూ తాళాలు నాచేతిలో వుంచింది కాని నాన్న కిచ్చిందా మరి ? ఆవిడ, నా కెలాంటి రహస్యాలు చెప్పిం దను

కున్నావు ? ఇంటిగుట్టు బ్రహ్మకైనా చెప్ప ననీ, కుటుంబ మర్యాదా, సంప్రదాయమూ నిలవబెడతా ననీ, నాచేత యెన్నిమాట్లు చేతిలో చెయ్యి వేయించుకుం దను కున్నావు ?"

"...................."

"ఇవాళ నేను హారీ అంటా ననుకో. ఇక యీకొంప యెందుకేనా పనికి వస్తుందా ? లేకపోతే, నేను నా అత్త వారి యింటికి వెళ్ళిపోతాననుకో. ఈయింటికేసి యెవ రేనా తొంగిచూస్తారా ?"

"...................."

"ఇదంతా నువ్వూ యెరుగుదువు. అయినా ముందు జాగ్రత్తకోసం చెబుతున్నాను. మరేమీ లేదు. చేబోలు వారి ఆడాళ్ళు కజ్జాకోర్లు. పైపెచ్చు నీఅత్తగారు చింతా వారి ఆడబడుచు కూడానూ. నెలకి నూట యాభై రూపా యలు తెస్తా డన్నమాటే గాని, అన్నీ పెళ్ళాంగారి చేతిలో పొయ్యడమే కదా నీమామగారు ? పాపం, కాస్తేనా పెత్తనం అంటూ వుందా ఆబ్రాహ్మడికి ?"

"...................."

"నీ పెళ్ళాం అన్ని విధాలా తల్లిని పుణికి పుచ్చుకుంది. ముద్దిమాటలూ అవీ నీభావమరిది పోయినప్పుడు చూశా

అంటాను. కావలసినవాళ్ళు కదా అనీ, పుట్టెడు దుఃఖంలో వున్నారు పోనీ అనీ, అక్కడ వున్న పది రోజులూ వండి పెట్టాను కాదూ? తల్లి దుఃఖంతో పడి వుండేది పోనీ అనుకో. తనేనా కాస్త సాయంకావ చ్చునా నాకూ? అదేం చదువో గాని అస్తమానమూ పుస్తకం చేత్తో పట్టుకుక్కూచునేది. ఎలా మానగలిగిందో ఆపది రోజులూ అర్మోణీ మాత్రం ముట్టుకో లేదు. ఆడ బడుచు పీనుగు నవ్వుదునా, యీడు వచ్చిన పిల్ల కదా, కాస్త ఆసరా కాకూడదూ? రాత్రి పూటేనా వంట చెయ్యకూడదూ, చెప్పు తమ్ముడూ? ఛీ, ఎప్పుడు వెళ్ళి పోతానా?'' అనిపించనా?

"................................"

"నువ్వు చిన్నవాడవు. అంచేత యింతగా చెబు తున్నాను. వెయ్యి కళ్ళతో నేను కనిపెడుతూనే వుం టాను. అయినా, చను విచ్చావంటే నెత్తెక్కుతుంది సుమా! నువ్వంటే భయభక్తు లుండేలాగ మసులు కోవాలి. నేనంటే గడగడ లాడేలాగ చూస్తూ వుండాలి నువ్వు. నాన్న వెర్రిబాగులవా డనీ, నేను మనోవర్తి మనిషిని కదా కనీ, నిన్ను లోపుచేసుకో మని యిదివరకే చెప్పి వుంటుంది తల్లి. అబ్బో! ఆమాటకి వస్తే, అసలు,

నీ పెళ్ళామే నెల్లూరి నెరజాణల రకం. అవతల పెద్దవా ళ్ళున్నారు కదా మన కెందు కని దేని కేనా, కసిం తయినా నవురూ బెదురూ వుం దనుకున్నావా మనిషికి?"

"..............................."

"నువ్వు వేషా లంటే సరదాపడతా వని అదనీ, యిదనీ నగలికి పురవ యిస్తుంది విన్నావు సుమా! అంత కావలిస్తే అక్కణ్ణుంచి తెచ్చుకో మను డబ్బు. తను వాళ్ళకర్తే కామా వారికి బిడ్డా? అక్కడి ఆస్తి అంతా యిక తనకి వచ్చేదే కామా?"

"..............................."

"ఇం తెందుకూ? అడిగే దిక్కు లేక కాని అయిన నూట యాభై రూపాయల జీతమూ యేమయి పోతోం దో చెప్ప మను. కాఫీలు, కాఫీలు, కాఫీలు. పొద్దున్నా మధ్యాహ్నమూ యేక కాఫీలే. నాకు ఆకాఫీ చూస్తే — కుడితిలాగ—వ్రూక్! మన యింటికి వచ్చాక నీ పెళ్ళాం కాఫీ పుచ్చుకుందంటే మనం గుడ్డిగవ్వకి మారం సుమా నాయనా! నువ్వు ఆకాఫీ రుచిలో పడిపోయా వంటే యిక దాని చేతిలో యిరుక్కున్నా వన్నమాటే సుమా"

బుచ్చమ్మ, యిలాగ చాలా సంగతులు చెప్పింది. చాలా దూరం కూడా చెప్పింది; కాని చలపతిరావు

దేనికీ జవాబు చెప్పలేదు. ఈమాటలు వింటూ వుంటే అతని కొక పంటికింద తీపీ, వొక పంటికింద చేదూ పడ్డట్టుంది. దాంతో ముసిముసి నవ్వులు నవ్వుతూ కొంత సేపూ, సిగ్గుపడి కొంత సేపూ, ఏమీ తోచక కొంత సేపూ, తోచినమాట పైకి అనేస్తే మొట్టిపోతుందేమో అని కొంత సేపూ అత నూరుకున్నాడు.

అది గ్రహించి, బుచ్చమ్మ "ఇది బాగా విను" అని వొకటీ, "యిది ముఖ్యమయింది సుమా" అని యింకొకటీ, "యిది మరిచిపోయావు సుమా" అని మరొకటీ—ఇలాగ మరికొన్ని సంగతులు కూడా చెప్పి "తమ్ముడు నామాటే వింటాడు" అని ధైర్యం వహించి చివరికి వూరుకుంది.

ఆరుంబావుకి తలంటు పూర్తి అయింది. మరో పది నిమిషాలికి అతను పొడిబట్ట కట్టుకోడమూ, ఆమె, జుట్టు చిక్కు తీసి బొట్టు పెట్టడమూ కూడా అయిపోయింది.

తరవాత "యింకేమిటీ చెయ్యడం?" అని ఆలోచిస్తూ అతను కవాచీబల్ల దగ్గిర నుంచుని వుండగా ఆమె వచ్చి, యెందుకో చెప్పకుండా చెయ్యి చాప మన్ని, వొక అర్థణా చేతిలో పెట్టి "కాఫీ హొటలుకి వెళ్ళి దర్జాగా అరకప్పు కాఫీ పుచ్చుకో. పెళ్ళాం వచ్చాటప్పటికి మొగం

వాచినట్టు, యింటో మెకుగుగా కూచిని వుండకూడదు నాయనా, గోదావరి గట్టే కోటిలింగాల దాకా షికారు వెళ్ళి సావకాశంగా యెనిమిదింటికో, యెనిమిది న్నరకో రా'' అని చెబుతూ జబ్బ పట్టుకొని వీధిలోనికి పంపేసింది.

౨

జగ్గయ్య, సాయంత్రం యేడు గంటల బండిమీద జోగ మ్మని తీసుకు వచ్చాడు.

మళ్ళీ యిన్నాళ్ళకి తన యింటో పునిస్త్రీపడుచు మసలబోతూ వున్నందుకు బ్రహ్మానందపడిపోతూ, మహా లక్ష్మిని లాగ తాను తన కోడల్ని తీసుకురావడం వీధిలో నలుగురూ చూడా లని అతను మహా అనుకున్నాడు; గాని ఆబండి చీకటి పడితే గాని వచ్చేది కాకపోయింది. దీనికి సాయం ఆవేళ అరగంట లేటు కూడాను.

కాగా అప్పటికి బాగా చీకటిపడింది.

తన ముచ్చట అంతా యిలాగ పూర్వపక్షం అయి పోవడంవల్ల బండి గుమ్మంలో ఆగడం తరవాయిగా దిగి, అతను లోపలికి వెళ్ళిపోయాడు.

"వచ్చావా?'' అంటూ బుచ్చమ్మ బండి దగ్గిరికే వచ్చి చెయ్యి పట్టుకుని దింపుతుం దనీ, గుమ్మంలో అడుగు

పెట్టేటప్పటికి యే యిరుగుపొరుగు పిల్లనో తీసుకువచ్చి, యెర్ర అక్షింతలూ, పచ్చ అక్షింతలూ దిగతుడిపించీ, కాళ్ళమీద నీళ్ళు పోయించీ యింటోకి తీసుకు వెడుతుం దనీ అనుకుంటూ వచ్చింది పాపం జోగమ్మ; కాని నాలు గైదు నిమిషాలు చూసినా బండి దగ్గిరి కెవరూ రాలేదు. పోనీ గుమ్మంలో నుంచున్నా రేమో అని ముందువేపు నుంచి తొంగిచూసింది కాని యెవరూ కనపడలేదు.

అందుకు చిన్నపుచ్చుకుని, దిగలేక దిగలేక బండి దిగి వుసూరు మంటూ తరవాత మెల్లిగా వెళ్ళిం దామె.

మండువా అంచున నుంచుని జగ్గయ్య బండివాడు తెచ్చిన సామాను దక్షిణపు గదిగుమ్మంలో పెట్టిస్తు న్నాడు. సిమెంటు బొమ్మలాగ బుచ్చమ్మ పడమటింటి గుమ్మంలో నుంచుని వుంది.

లోపలికి వచ్చాకయినా ఆమె పలకరించకపోవడం చూసి, జోగమ్మ, మరీ యిదయిపోయి వుత్తరపు గది గుమ్మం దగ్గిర నిలబడిపోయింది.

ఎక్కడా మాట వినపడకపోవడం జగ్గయ్యకి కూడా వింతగానే వుంది; కాని ఆశాభంగంవల్ల యెలాగో అయి పోయి వుండి, అతను, విషయం గ్రహించలేకపోయాడు.

సామా నంతా తేవడం అయిపోయింది. "అనా

యెక్కువ పుచ్చుకున్నావురా అబ్బీ! అయితే లే పట్టుకు పో. కల్లుపాకలో తగలెయ్యక యిది యింటికి పట్టుకు పోయి గుర్రానికి పెట్టి, నువ్వూ పిల్లలూ లక్షణంగా తినండి" అని చెబుతూ, బొడ్డుకొంగున వున్న మూట విప్పి, జగ్గయ్య బండివాడి చేతిలో పావలాకాసు పడేశాడు.

"సామాను లెక్క చూసుకోండి బాబయ్యా" అంటూ బండివాడు వెళ్ళిపోయాక, కొంత ప్రకృతిలో పడి "అబ్బాయి కనపడ్డేమే?" అని అడిగాడు జగ్గయ్య.

"గుర్రబ్బం డయితే మాత్రం, పేటకి పావలా యేమిటీ?" అంటూ సాగతీసుకుంది బుచ్చమ్మ.

"అబ్బా యేడే?" అని మళ్ళీ అడిగాడతను.

"ఇంటో లేడు"

"ఎక్కడికి పంపావూ?"

"నేను పంపానా?"

కళ్ళు చికిలించుకుని "పోనీ యెక్కడికి వెళ్ళాడూ?" అని అడిగాడు జగ్గయ్య.

"నేను చూశానా?" అని కొంచెం కరుగ్గా యెదురడిగింది బుచ్చమ్మ.

"ఎంతసేపయిందీ వెళ్ళీ?"

"ఏమో నాన్నా"

"భోజనం చేశాడా ?"

"లేదు"

అతని కేమీ పాలిపోలేదు. "ఎక్కడికి వెళ్ళాడో, యెవరితో తిరుగుతున్నాడో ?" అని స్వగతంగానే అనుకున్నాడు; గాని మాట మాత్రం పైకి వచ్చేసింది.

"ఇప్పుడే తల అంటుకున్నాడు. చల్లగాలి కోసం యే గోదావరి గట్టుకో, యే మూజియం తోటకో షికారు వెళ్ళి వుంటాడు. వెడితే మాత్రం భోజనాల వేళ కేనా రాకుండా అక్కడే కూచుంటాడా యేమిటీ? నువ్వు గోదావరికి వెళ్ళిరా. లేకపోతే నేను నీళ్లు తోడతాను నూతికి పద" అని బుచ్చమ్మ సాచేసి చెప్పింది; కాని "యెవళ్ళతో తిరుగుతున్నాడో ?" అనే మాట తన చెవుల్లో "రింగ్, రింగ్" మనగా జోగమ్మ వులిక్కిపడి పోయింది.

తరవాత వొక్క క్షణం అలాగే నుంచుని, చివరికి "హుఁ" అని వొక్క అంగ వీధికేసి వేసి "సామాను గదిలో సర్దుకోవమ్మా" అని కోడలికి చెప్పి జగ్గయ్య చరచరా గోదావరికి వెళ్ళిపోయాడు.

ఇక వాకట్లో మరదలూ ఆడబడుచూ మిగిలారు.

వెలగలేక వెలగలేక వెలుగుతూ వృన్న బుడ్డిదీపం కాంతి ఆయిద్దరి కళ్ళల్లోనూ తళుక్కు మంది.

ప్రౌఢిమ చాలక "యేమి టీ వాలకం?" అని జోగమ్మ ఆలోచనలో పడగా, "మావఁగారు చెప్పేదాకా అలా బొమ్మలాగ నుంచోవాలి కామోసు. అదంతా సిగ్గు కామోసు. బాగానే వుంది" అని వినపడీ వినపడ నట్టు సాగతీసుకుని, మూతి ముడుచుకుని, వెక్కు అంగలో బుచ్చమ్మ వంటింటో వెళ్ళిపడింది.

మరో పది నిమిషాలికి యింటికి వచ్చి "అబ్బాయి వచ్చాడా?" అని అడుగుతూనే, జగ్గయ్య, లోపల అడుగు పెట్టాడు.

ఉలిక్కిపడి "లే" దని జవాబు చెప్పింది జోగమ్మ.

"వడ్డిస్తున్నాను" అని వంటింటోనుంచే కేక వేసింది బుచ్చమ్మ.

"అబ్బాయి వచ్చేదాకా వుండడమా, ముందు భోజనం చెయ్యడమా?" అని ఆలోచిస్తూ జగ్గయ్య పట్టుపంచె కట్టుకునేటప్పటికి, ఆకలి, చెయ్యి పట్టుకుని భోజనాల వసారాలోకి లాక్కుపోయి పీటమీద కూలేసింది.

## 3

జోగమ్మకి, ఆచంటలో పోస్తున్న తొమ్మిదింటికి తిన్న మెతుకులు..

కావలసినప్పుడు దారిలో తినమని తల్లి జంతిక లిచ్చింది; కాని మెయిలుపడవలో వున్నంతసేపూ మూట మామ గారి దగ్గిర వుండిపోవడంవల్లా, నిడదవోలు స్టేషనులో జనసమ్మర్దం యెక్కువగా వుండడంవల్లా వాటిని తలుచు కుని గుటకలు మింగుతూనే ఆమె కాలం గడిపింది.

ఈసంగతి యేమీ యెరగని జగ్గయ్య, స్టేషనులో "అరిటిపళ్ళు కొనమంటావా?" అంటూ బేరం చేశాడు; గాని మొగమాటపడిపోయి ఆమె "వద్దుగాక వ"ద్దనేసింది.

మొత్తానికి రాజమహేంద్రవరం వచ్చాక అడిగి పుచ్చు కునీ దాకా ఆమె పచ్చిమంచినీళ్ళైనా యెరగదు.

చలపతి యెనిమిదిన్నరకి వచ్చాడు.

నీరసం వల్ల గాఢనిద్ర పట్టగా జోగమ్మ అది కూడా యెరగదు.

ఇక్కడ జోగమ్మలాగే అక్కడ వుత్తరపు వసారాలో జగ్గయ్య కూడా గాఢనిద్రలో వున్నందుకు పొంగిపోతూ,

ఏదో పనిమీద అటూ యిటూ తిరుగుతూ వున్నట్టు నటిస్తూ అందుకోసం కనిపెట్టుకుని వున్న బుచ్చమ్మ, గభీమని యెదురువెళ్ళి, హాల్లో అడుగు పెట్టినవాణ్ణి వీధిలోకి తీసుకువెళ్ళి, కంఠం నొక్కుకుంటూ "నీ పెళ్లాం వచ్చిందిరా" అంది.

"ఏదీ ?" అన్నాడు చలపతి.

అతను కూడా బుచ్చమ్మ ననుసరించి కంఠం నొక్కుకోడానికే ప్రయత్నించాడు; కాని వుబలాటం కొద్దీ మాట కొద్దిగా గట్టిగా వచ్చేసింది.

"ఉత్తరపింటి గుమ్మంలో పడుకుంది"

ఈమాట చెబుతూ, ఆమె, యిక గట్టిగా మాట్టాడవద్దన్నట్టు అతని పెదవులకు తగిలీ తగలకుండా వొకమాటు తన చెయ్యి అడ్డు పెట్టింది.

"ఊహూ"

"ఇప్పుడు మాట్టాడించకేం ?"

"ఏం !"

లంకణాలు చేసినవాడి మాటలాగ అతి నీరసంగా వచ్చిం దీమాట.

"తప్పు తప్పు. లోకు వయిపోవూ ? గదిలోకి వచ్చి అదే ముందు నిన్ను పలకరించాలి"

"అదా ?"

పూటుపడ్డాడు మానవుడు.

"పెద్దవాళ్ళుండటం యిలాగ మంచీ చెడ్డా చెప్పడానికే. తెలిసిందా ?"

"ఆ"

"చడీ చప్పుడూ కాకుండా పట్టుపంచె కట్టుకు చక్కారా"

"అలాగే"

ఇద్దరూ గుమ్మం దాటారు; కాని అడ్డు వచ్చి హఠాత్తుగా ఆపేసి "ఎవరేనా అడిగితే నీకు నువ్వే గోదావరి గట్టుకి షికారు వెళ్ళినట్టు చెప్పేం ?" అంది బుచ్చమ్మ.

"నువ్వు వెళ్ళమన్నావంటేం ?"

"హా—వ్వ" అని రుంజుకుంటూ నోరు నొక్కుకుందామె.

అలా చెబితే అదేదో గొప్ప తప్పు అయిపోతుంది కామోసు అనుకుని "సరేలే" అన్నాడతను.

తరవాత, జోగమ్మ యెక్కడ చూసిపోతుందో అని నక్కుతూ, పిల్లిలాగ అడుగులు మెల్లిగా వేస్తూ, దక్షిణపు గదిలోకి చలపతీ, పడమటింటోకి బుచ్చమ్మా చక్కాపోయారు.

బుచ్చమ్మ పీట వాల్చింది. విస్తరి వేసింది. వడ్డించింది. కంచుచెంబుతో మంచినీళ్ళు పెట్టింది. నెచ్చగిల్లడం కోసం నేతిగిన్నె పాయి దగ్గిరిగా పెట్టింది. ఒక్క క్షణం గుమ్మాకేసి యెదురు చూసింది; కాని యిన్ని చేశాటప్పటికీ చలపతి మడి కట్టుకు రాలేదు.

వెంటనే మండువా గుమ్మాంలోకి వచ్చి గదికేసి తొంగి చూసింది. అతని జాడ కనపడ లేదు.

ఒక్క క్షణం అయినాక మండువాలోకి వచ్చింది. అయినా లాభం లేకపోయింది.

మెల్లిగా గది గుమ్మంలోకి వెళ్ళి తొంగి చూసింది. మంచానికి చేరబడి నుంచుని వున్నాడు చలపతి.

జోగమ్మకోసం యెదురు చూస్తున్నా డతను. "లేచిందా ?" అనీ "వస్తోందా ?" అనీ అప్పటికప్పుడే రెండు మూడు మాట్లు తొంగిచూసి కూడా వున్నా డతను.

అంచేత గుమ్మాంలో కెవరో వచ్చినట్టు అలికిడి కాగా, కుడి కాలి బొటన వేలితో గోడినీ రాస్తూ చటాలున మొగం వంచేసు కున్నాడు;

కాని వోరకంట చూశాడు.

సైనుపంచె కనపడింది.

కింది చూపులే నిదానించి చూశాడు.

భోసికాళ్ళు కనపడ్డాయి.

అనుమానిస్తూనే మొగం పైకెత్తుకుని చూశాడు.

నిలువునా బుచ్చమ్మ.

తెల్లపోయాడు. నీరయిపోయాడు.

అప్పుడు బుచ్చమ్మ లోపలికి వెళ్ళి "రావేం ?" అంది.

"లోపలి కింకా రాలేదే అక్క"

"ఇప్పుడు కాదురా. నిద్రపోతోంది కూడాను"

"మరెప్పుడూ ?"

"భోజనం చేశాక"

"అయితే పద"

బుచ్చమ్మ మామూలుగానే వంటింటోకి వెళ్ళిపోయింది. కాని చలపతి పట్టుపంచె కట్టుకుని, జోగమ్మ నిద్ర పోతోంది గదా అన్న దిలాసాతో, వెన్ను విరుచు కుంటూ దర్జాగా భోజనాల వసారాలోకి వెళ్ళాడు.

## ४

వెళ్ళీ వెళ్ళడంతోటే అతను పరిషేచన చేశాడు.

బుచ్చమ్మ నెయ్యి వడ్డించబోయింది; కాని రెక్క పట్టుకుని యెవరో వెనక్కి లాంగేస్తున్నట్టాగిపోయి, చుర

చురచూస్తూ "కాళ్ళు కడుక్కున్నావా ?" అంటూ మెల్లిగానే, కంగారు పడుతూ అడిగింది.

"లేదే" అని అతను కూడా మెల్లిగానే చెప్పాడు; గాని బిక్కమొగం వేశాడు.

ఇద్దరూ ఎలా వున్నవా రలా పేరుకుపోయారు.

ఏమిటి దారి ? ఇంటికి పెద్దదిక్కు కదా, తాను చూస్తూ వుండీ కూడా అనాచారం జరిగిపోతూ వుంటే వూరుకోగలదా బుచ్చమ్మ ? కాని జరిగిపోయింది. ఇక కలిసిరాదు. అయినా సంప్రదాయం నిలవబెట్టవలసిన పూచీ తనది కనక వొక్క క్షణం ఆలోచించింది. ఆమె ఆలోచించినంత సేపూ విస్తరిలో యెక్కడ యెలా వున్న చెయ్యి అలాగే వుంచేసుకుని ఆమె కేసి చూశా డతను.

చివరికి బుచ్చమ్మకి అంతర్వాణి ఆదేశం యిచ్చింది. దాంతో ఆమె కరుణించి "ఇంకెప్పుడూ యిలా చెయ్యకు. భోజనం చేశాక మాత్రం కాళ్ళు కడుక్కోసుమా" అని వుపదేశించి, నెయ్యి మరో గరిట యెక్కువ వడ్డించింది.

తరవాత ఆమె మామూలుగానే మాట్లాడుతూ వుండినా తాను మట్టుకి సంజ్ఞలతోటే వ్యవహరిస్తూ, వంచిన తల యెత్తకుండా గబగబా నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని, జోగమ్మ చూడకుండా గదిలోకి వెళ్లి

పోవా లన్న ఆత్రంతో చెయ్యి మాత్రమే కడిగేసుకుని, గుట్టుగా గదిలోకి వెళ్ళి, ఆసాయంత్రమే తల అంటుకుని వుండడంవల్ల నిద్ర ముంచెత్తుకు రాగా అతికష్టంమీద నూలుపంచె కట్టుకుని మంచాన పడ్డాడు చలపతి.

అతనిలా వెళ్ళాడు, గడియారం అలా తొమ్మిది కొట్టింది. జోగమ్మ వులిక్కిపడి లేవడమూ, "బొట్టు పెట్టి పిలవాలి కామోసు" అని ధుమధుమ లాడుతూ బుచ్చమ్మ వాకట్లోకి రావడమూ ఒక్కమాటే జరిగాయి.

మళ్ళీ రెండోమాటు యిద్దరి కళ్ళూ కలిశాయి. ఇక పిలవడం యెందుకూ? ఇద్దరూ యిలాగే అనుకుంటూ ఒకరు ముందూ ఒకరు వెనకా లోపలికి వెళ్ళారు.

కట్టుకున్నది పెద్దాపురం పట్టుచీర కావడంవల్ల కాళ్ళు మాత్రం కడుక్కు వచ్చి జోగమ్మ భోజనం ప్రారంభించింది.

"అవసరం లేకు" అనుకుంటూనే "మీ అమ్మా మీనాన్నా కులాసాగా వున్నారా?" అని బుచ్చమ్మ అప్రయత్నంగా నోరు జారేసింది.

అలా చూడకుండానే జోగమ్మ "ఆ" అంది.

ఇక బుచ్చమ్మ వాక్ప్రవాహం ఆపుకోలేకపోయింది.

"మీనాన్న దగ్గిర గుమాస్తా? ఆయన చెల్లెలూ? ఆవిడ పే రేమిటి?"

"పుల్లమ్మ"

"ఆవిడ ఆచోటలోనే వుందా?"

"ఆ"

"అప్పుడే వెడుతుం దనుకున్నారు. ఆవిడ రామేశ్వరం వెళ్ళివచ్చిందా?"

జోగమ్మకి వొళ్ళు మండిపోయింది; కాని శాంతించి "ఆ" అంది.

"మహా మంచి మనిషి ఆవిడ. ఎప్పుడో వో మాటు వెళ్లి చూసి రావాలి"

ఇలాగ భోజనం వోపట్టాన తెమలకుండా, బుచ్చమ్మ, అదనీ యిదనీ ఆచోట గొడవ లడుగుతూ, వుండుండి యిక్కడి కబుర్లు చెబుతూ, మధ్యమధ్య యిడుగుపొడుగు అనుకూలదంపతులుకి పేళ్లూ పద్దెలూ పెడుతూ, కొత్తి మిరి కారంతోటీ, మామిడిపిందెల పచ్చడిబద్దలతోటీ, వంకాయ పెరుగుపచ్చడితోటీ, చివరికి మీగడ పెరుగు తోటీ కాస్త కాస్త చొప్పున వుప్పుపిండి తిని, యిల్లాంతా సద్దించి, తన పక్క మండువా వాకట్లో సవరించుకుని, "అమ్మయ్యా, నడుం లాక్కుపోయింది రామయ్య

తండ్రీ అని పడుకుని, హు – హూ – హూ" అంటూ ఫక్కుమాటు అలాగా యిలాగా దొర్లి, జోగమ్మకి సెల విచ్చాటప్పటికి పది ముప్పావయింది.

౫

తెల్లవారు జామున మూడున్నరకే బుచ్చమ్మకి మెళుకువ వచ్చింది.

తరవాత మరి నిద్ర రానూ లేదూ, ఆమె అందుకోసం ప్రయత్నించనూ లేదూ

పైగా, ఏమిటో మించిపోతున్నట్టు మనస్సు అటమటించిపోయింది.

ఒకటి రెండు మాట్లు ఆమె దక్షిణపు గదిగుమ్మంలోకి వెళ్ళి, తలుపుసందుకి సరిగా చెవి ఆనించి ఆలకించింది; కాని దంపతులలో వొకరూ మేలుకుని వున్నట్టు తోచలేదు

తరవాత అత్తికట్టుమీద అరగంట వూరుకుంది. మరో అయిదు నిమిషాలు కూడా పస్తాయించింది. తరవాత యిక ఆగలేకపోయింది. వెనకాల యెవరో తరుముకు వస్తున్నట్టు తొందర పుట్టింది.

సరిగా యీసమయంలో గడియారం నాలుగు కొట్టింది. దాంతో ఆమె "బాబోయ్" అంటూ వులిక్కి-పడి లేచి కూచుంది. నరా లన్నీ వుక్కుమాటు పొంగి పోయాయి.

వెంటనే గుమ్మంలోకి వొక్క గంతు వేసి, దడదడ మని గొళ్ళెం కదిపి "తెల్లవారిపోవచ్చింది లేచి చదు వుకో తమ్ముడూ" అంటూ కేక వేసింది.

జవాబు రాలేదు. అరనిమిషం వూరుకుని మళ్ళీ పిలి చింది. లాభం లేకపోయింది. ఓరుగాలి కొట్టినట్టు తలుపు గుంజి మళ్ళీ పిలిచింది. దాంతో జోగమ్మకి మాత్రం మెలుకువ వచ్చింది; కాని ఆమె పలకలేదు.

అన్నిమాట్లు పిలిచినా యెవరూ పల్కకపోవడం బుచ్చమ్మకి తొందరం అంటించింది. దాంతో "వోరి నీ నిద్ర—వురేయ్" అంటూ ఆమె మళ్ళీ గొళ్ళెం కదిపి, తలుపు గుంజి వురిమి పిలిచింది.

అప్పుడు జోగమ్మ మొగుణ్ణి మెల్లిగా కదుపుతూ "మీఅక్క పిలుస్తోంది" అంది; కాని "వూరుకుందూ" అని ముసముస లాడుతూ చలపతి గోడవేపుకి తిరిగి పడుకున్నాడు.

స్పష్టంగా తెలవలేదు; గాని బుచ్చమ్మ లోపల

యేవో మాటలు జరుగుతున్నట్టు మాత్రం గ్రహించి "తమ్ముడూ" "అబ్బాయీ" "వొరే బుల్లేడా", అని రకరకాల పిలిచి, అప్పటికీ జవాబు రాకపోగా "యిలా వుందా మీ పని !" అని కక్ష వహించి "మొగడికీ పెళ్లానికీ వొకటే నిద్ర. ఆడదాని కూడా మొగ్గా నిద్దరే అయితే యెలాగ దేవుడా వేగడం ? ఏడిసినట్టే వుంది సడసు. సిగ్గూ బిడియమూ లేకపోతే సరి. మొండివాడు ముక్కుకోస్తే నెత్తురు తాగాడుట, అలా వుం దిది. ఇలా అయితే బాగుపడ్డామే ! మంచి సంప్రదాయమే దాపరించింది చివరికి. పోనీ నీకయినా మెళుకువ రాలేదుటే మాతల్లీ ?" అని సాగతీసుకుంటూ మళ్ళీ తలుపు గుంజి గుంజి విడిచిపెట్టింది.

దాంతో యిక పడలేక లేచి వచ్చి జోగమ్మ తలుపు తీసింది.

వెంటనే బుచ్చమ్మ మంచం దగ్గిరికి వొక్క దూకు దూకుంది.

అందుకు సిగ్గుపడిపోయి జోగమ్మ యివతలికి రాగా బుచ్చమ్మ మరీ సంతోషించి "యేదో చదువుకుంటూ వున్నట్టు నటించకపోతే నీ పెళ్ళాం లోకువ చేసేస్తుం

దురా" అంటూ చెవిలో వూది చెయ్యి పట్టుకుని చల
పతిని యివతలికి నడిపించుకువచ్చింది.

ఇదంతా చూశాటప్పటికి జోగమ్మకి అరికాలి మంట నెత్తికి వచ్చింది; కాని సాహసించలేకపోయింది. వెంటనే లోపలికి వెళ్ళి తలుపు గడియ వేసేసి పోయి రెండు చేతులతోటీ మొగం మూసుకుని వుసూరు మంటూ బోర్లపడుకుంది.

## ౬

"దీపం పెద్దది చెయ్యవే". అంటూ స్తంభం దగ్గిర చతికిల బడ్డాడు చలపతి; కాని యేమి పుస్తకం చదవడమో అతనికి తోచలేదు.

అసలు అతని దగ్గిర పుస్తకాలే యేమీ లేవు.

సంవత్సరం కిందట జోగమ్మ రజస్వల అయిందన్న శుభలేఖ రాగా, బుచ్చమ్మ ప్రోత్సాహంవల్ల చదువు మానేశాడతను. అప్పటి పుస్తకా లయినా యేమయిపోయాయో అత నెరగడు.

జగ్గయ్య దగ్గిర పంచాంగం తప్ప మరేమీ లేదు. పోనీ అంటే చలపతి కదిలి నడవడు.

బుచ్చమ్మ తమ్ముడి స్థితి అంతా గ్రహించింది. బాధ్యత అంతా తనమీద వుండడం కూడా ఆమె గమనించింది.

ఏసమక మయినా, యే చమక మయినా — చివరికి పుణ్యాహవాచనమూ, విఘ్నేశ్వరపూజా అయినా వచ్చి వుంటే ఆమె అవే యేకరువు పెట్టుకోమనడానికి వీలుండును; కాని అతనికి సంధ్యావందన మయినా రాదు.

వెంటనే ఆమె లేచివెళ్ళి, వంటింటో మిరపకాయల బుట్టమీద మూతగా వున్న లంకాయాగం తీసుకువచ్చి అతని చేతిలో వుంచింది.

దీపం కూడా యెగసన తోసింది.

చలపతి మాట్లాడకుండా పుచ్చుకుని విప్పాడు. తానెప్పుడు లెమ్మంటే అప్పుడు మారు చెప్పకుండా లేవడమూ— యేపుస్తకం చేతిలో పెడితే "ఛా, యిదా?" అనకుండా అదే పుచ్చుకోడమూ చూసి బుచ్చమ్మ మురిసిపోయింది.

కాని చూసి చూసి చలపతి

"శ్రీరామ రఘుపతీ సీత పిలిపించుకుని
కోరి వేదము చదవగా"

అని లక్షణంగా పాట మొదలు పెట్టాడు.

దాంతో ఆమె గతుక్కు మనిపోయింది. కొయ్యై కూడా అయిపోయింది.

కాని వొక్క క్షణంలో యెగిరి లేచి కూచిని, వొక్క అంగలో చలపతి దగ్గిరికి వెళ్లి మూతి బిడాయించుకుని తీవ్రంగా చూస్తూ ముందు పుస్తకం వుళాక్కుంది. తర. వాత, కిందికి వాలివున్న చలపతి తల పైకెత్తి, చెవి పైకి వచ్చేటట్టు రెండు చేతులతోటీ పట్టుకుని పక్కకి వంచి, ఆచెవిలో నోరు పెట్టి "పైకి చదువుతావుట్రా నీ కొంప తెల్లవారిపోనూ, నీపెళ్లాం వింటే నవ్వుపుట్రా ? ఇవాళకి లోపల్లోపలే చదువుకో. తెల్లవారాటప్పటికి నాన్నని బజారుకి పంపి బాలరామాయణ మయినా, పెద్దచ్చు అమర మయినా తెప్పించి యిస్తాను, రేపట్నుంచి గట్టిగా చదువుదువు గాని" అని బుద్ధి చెప్పి, మళ్ళీ పుస్తకం చేతిలో పెట్టి చక్కావచ్చి పడుకుంది.

చలపతి "బతికాం" అనుకున్నాడు. నిద్ర చెడగొట్టి లేచి కూచోబెట్టినందుకు కతనికి కొంచెం కోపంగానే వుండింది; గాని యీమాట చెవిని పడేటప్పటి కది సంతోషంగా మారిపోయింది.

బుచ్చమ్మ రోజూ పాడుకుంటూ వుండగా వింటు న్నాడు కనక నలిగి వుండి ఆచరణం చరచరా చదవగలి

గాడు; గాని కూడపలుక్కోకుండా వొక్క అక్షరమూ అతనికి నడవదు.

"అబ్బాయిచేత బి. యే పరీక్ష యిప్పించి "మేస్రీటు" పని చేయించా" లని వుబలాట పడి, మేనత్త, యింగ్లీషు చదువులో ప్రవేశపెట్టించగా, ఫస్టుఫారంలోనే దండయాత్రలు ప్రారంభించి, యేడేళ్ళకి—అంటే తన పందొమ్మిదో యేట థర్డుఫారం చదువుతూ పాఠశాల విడిచిపెట్టేశాడతను.

అంచేత అతనికింగ్లీషూ అంటలేదు. పాఠశాలకే బలాదూరు కనక తెనుగూ గుంటపువ్వులు పూసేసింది.

ఆపైని, అలంకారయూగం, "పీ. కే. థభఫధక్ష మొదలియారు సాయింగా పరిష్కరించి సుకీయ ఆరుముగం ముద్రాక్షరసాల న్ముద్రించింది" కూడానూ.

అయితే యేం?

చమురు నిండా వుండడంవల్ల దీపం బంతిపువ్వ లాగ వెలిగిపోతూనూ వుంది. పుస్తకంలో మొదణ్ణుంచి చివరికీ, చివరినుంచి మొదటికీ కాగితాలు గిర్రున తిరిగిపోతూనూ వున్నాయి. "తమ్ముడు నామాట తీసెయ్యడు" అని బుచ్చమ్మ గర్వపడుతూనూ వుంది. ఇదేమిటో బోధపడక గదిలో జోగమ్మ అటమటించిపోతూనూ వుంది.

కాని, యిలాంటి సమయంలో, యెలా వచ్చిందో యెవరికీ తెలవకుండా వచ్చి గాఢనిద్ర అందర్నీ అలుముకుంది.

భళ్ళున తెల్లవారాక అప్పలమ్మ వచ్చి "బుచ్చమ్మ గోరూ! బుచ్చమ్మగోరూ" అంటూ పదిమాట్లు తలుపు గుంజీదాకా యెవరికీ మెళుకువ రాలేదు.

## ౨

అప్పుడయినా ఆ మెళుకువ అందరికంటే ముందు జగ్గయ్యకి వచ్చింది.

కళ్ళు నులుముకుంటూ లేచి చూశాటప్పటి కతనికి వెలవెల పోతూ వున్న దీపం దగ్గిర, కొట్టేసిన పాములాగ పడి వుండిన చలపతి కనిపించాడు.

"ఏమి టిదీ?" అని అతను తుళ్లిపడ్డాడు. జోగమ్మకి నడవలో పడుకోవలసివచ్చిందేమో అని అలా చూశాడు; కాని అక్కడ యెవరూ లేరు. బుచ్చమ్మ తన మంచంమీదే పడుకుని వుంది.

కారణం తోచక కంగారు పట్టుకుంది.

దాంతో అతను "వస్తున్నానే, వినపడిందే" అని

అప్పలమ్మకి ఝాంకారంగా చెబుతూ లేచి, దగ్గిరికి వెళ్ళి చలపతిని తట్టి లేపి "ఇక్కడ పడుకున్నా వేం నాయనా?" అంటూ ప్రేమతో అడిగాడు.

చలపతి వులిక్కిపడి చూశాడు. కళ్ళు జోతుల్లాగున్నాయి. బట్టసద్దుకుంటూ పలవరింత లాగ గోగో గొణుక్కున్నాడు. ఎవరో లాగేస్తున్నట్టు కనురెప్పలు బరువుగా మూతలు పడిపోయాయి.

జగ్గయ్య "యిక్కడ పడుకున్నా వేం అబ్బాయీ ?" అంటూ మళ్ళీ తట్టి లేపాడు.

దీంతో బాగా మెళుకువ వచ్చి చలపతి లేచి కూచున్నాడు; కాని మళ్ళీ వొక్క జోగు జోగి "చదువుకోమంటూ నాలుగ్గంటలకే లేపి కూచోపెట్టింది అక్కయ్య" అని చెబుతూ వుబ్బెత్తుగా లేచి, తూల్తూ తూల్తూ దొడ్లోకి చక్కపోయాడు.

"చదువా ?" అంటూ కళ్లు చికిలించుకుంటూ పుస్తకం తీశాడు జగ్గయ్య. "లంకాయాగం" అని అక్షరాలు కనపడ్డాయి. "ఇదేమిటీ ?" అనుకుంటూ వుండగా అప్పలమ్మ మళ్ళీ తలుపు గుంజింది.

ఇటు లంకాయాగం. అటు లంకిణి లాగ అప్పలమ్మ. వీటికి సాయం యెప్పుడూ లేంది తెల్లవారుజామున చదువు.

జగ్గయ్య అగ్గయిపోయాడు.

అతను, ముందు, పళ్ళు కొరుక్కుంటూ బుచ్చమ్మ కేసి చూసి తుళ్ళుతు కళ్ళయిపోయేటట్టు పుస్తకం లాంతర్ల గూట్లోకి విసిరేశాడు. తరవాత వృత్తి కిందికి జారిపోయేటట్టు లాంతరు మర వొక్క తిప్పు తిప్పేశాడు.

ఈసమయంలో అప్పలమ్మ మళ్ళీ తలుపు బద్దలు కొట్టింది. వెంటనే జగ్గయ్య, తారాజువ్వ లాగ వొక్క యెగు రెగిరి, ధుమధుమ లాడుతూ వొక్క అంగలో వెళ్ళి భడీమని తలుపు తీసి "వస్తున్నానే అంటూ వుంటే వొకటే గోలా? ఒక్క క్షణం నుంచోలేవూ? అస లింత పొద్దెక్కే దాకా యేం చేస్తున్నావ్?" అంటూ ఆకోపం అంతా అప్పలమ్మమీాద వొలకపోసేసి గాది సావిట్లోకి వెళ్ళిపోయాడు.

ఈరభసకి తుళ్ళిపడి, వాకట్లో బుచ్చమ్మా, గదిలో జోగమ్మా వొక్కమాటే మేలుకున్నారు.

అయితే, తండ్రి రుసరుసలూ, అప్పలమ్మ గొణుగుడూ చూసి, యిదంతా తలుపు తియ్యడం దగ్గిరే వచ్చిం దను కుంది బుచ్చమ్మ.

దానిమీాద "నే నొక్క క్షణం యెక్కడి కేనా వెడితే—వొక్క క్షణం నిద్రపోతే—వొక్క క్షణం బద్ధకిస్తే

యీ కొంప కొల్లే రయిపోతుంది. నేనేం కావా లని యేడిచానా యేమిటీ పెత్తనం? దాసీదా న్నంతగా తిట్టడం యెందుకూ, నన్నే లేపితే యేం?" అంటూ లేచి కూచుం దామె.

ఆ లేవడంలో నయినా జోగమ్మ యివతలికి వచ్చిందా లేదా అని గదికేసి వోరకంట చూస్తూనే లేచింది.

తరవాత యిద్దరూ మొగాలు కడుక్కునేటప్పటికి రెండు బారల పొద్దెక్కింది. అందుకు, ఏదో మునిగిపోయి నట్టు రుసరుస లాడుతూ, బుచ్చమ్మ "తెలివి తెల్లవారి నట్టే వుంది. ఇంత పొద్దెక్కేదాకా పడుకుంటే పను లెలా తెమల్తాయీ?" అని సాగతీసుకుని "వంటిల్లు అలుకు" అని మరదలికి పురమాయించి వీధిగుమ్మంలోకి వెళ్లింది.

అప్పటి కప్పుడే పక్క యింటి సోదెమ్మ, గుమ్మంలో నుంచుని కొత్తిమిరీ, కరివేపాకా, పచ్చిమిరపకాయలూ— యిలాంటివి పుచ్చుకుంటోంది.

ఇద్దరూ వొక రొకరు చూసుకున్నారు. వెంటనే "వొసేవ్! రాత్రి మా మరదలు వచ్చింది సుమా" అంటూ బుచ్చమ్మ ఆగుమ్మంలోకి వెళ్లింది. "నేనలాగే అనుకున్నానే. అయితే వొదినా, సుఖంగా నిద్ర పోకుండా

నాలుగ్గంటలకే లేపా వెందుకే పాపం చలపతి. బావనీ?" అంటూ ఆసోదెమ్మ అరుగుమీద చతికిలబడింది.

ఇద్దరూ కభుర్లు విడేశారు.

"ఇదిగో వచ్చే" అని యింట వాళ్ళకి బనులు చెబుతూనే సోదెమ్మా, "వెళ్ళాలి. బోలెడు పనుంది" అని తొందరపడుతూనే బుచ్చమ్మా యిసకపాతట్లో పడి పోయారు.

కూరలమనిషి పచ్చిమిరపకాయ లివ్వకుండా వెళ్ళి పోవడం యిద్దరూ గమనించలేదు.

చివరికి, యిదిగో అదిగో అంటూ అరగంట అయితే గాని ఆయిద్దరూ అక్కణ్ణుంచి కదల్లేదు.

ఆకదిలాక అయినా "అమ్మో, నీతెలివి తెల్లవారి పోనూ, చెప్పావే కాదేమిటే?" అని సోదెమ్మా "వోసి నీ మొగం యీడ్చా నేను మాత్రం చూశానా యేమిటే?" అంటూ బుచ్చమ్మా సాగతీసుకుంటూ ఈయింటికి బయలుదేరారు.

అప్పటి కప్పుడే జోగమ్మ, ఆడబడుచు చెప్పిన పని పూర్తిచేసేసి, ఆసందట్లో చేతికి అడ్డు వచ్చిన వొకటి రెండు చిన్నపనులు కూడా కానిచ్చేసి, పుట్టింటినుంచి తెచ్చుకున్న సామాను సద్దుకుంటోంది.

గుమ్మంలో అడుగు పెట్టేటప్పటికి వాళ్ళ కిద్దరికీ, బల్లమీద, మొదట హార్మోనియం కనపడింది. దాని తరవాత బొట్టుపెట్టీ, పాందానూ, వెండిచెంబూ, అత్తరు దానూ వరాసగా వున్నాయి.

బుచ్చమ్మ మూతి బిడాయించుకుంది; కాని సోదెమ్మ మాత్రం అలా కాక' ప్రీతితో జోగమ్మ దగ్గిరికి వెళ్లి "మంచమూ అవ్వీ యెప్పుడు పెడతా రమ్మా మీ వాళ్లు?" అని లాలనగా అడిగింది.

"సెలవు పుట్టక మానాన్నగారు కూడా రాలేక పోయారు. ఈనెల ఆఖరుకి సెలవు వస్తుంది. అప్పుడు మా అమ్మ కూడా వస్తుంది. పందిరి మంచమూ, బట్టల బీరువా, కుర్చీలూ, మార్బిలు బల్లా, నిలువుటద్దమూ, యిత్తడిసామానూ—యిలాంటి వన్నీ అప్పుడు కొంటారు" అని జోగమ్మ దానికి ముద్దుగా బదులు చెప్పింది.

సోదెమ్మ చాలా సంతోషించింది. "బాగుందమ్మా! మీవాళ్ళకి అందచందా లన్నీ బాగా తెలుసు. మను గుడుపులికి వచ్చినప్పుడు చూశాను కాదూ? నీకు అచ్చట్లూ ముచ్చట్లూ బాగానే తీరతాయి" అంటూ ఆమె యెంతో మెచ్చుకుంది.

కాని బుచ్చమ్మ కిది కొట్టినంత పనయింది. ఆమె

మొగం యిట్టే మాడిపోయింది. వెంటనే ముసముస లాడుతూ "బోగందాన్ని పంపినట్టు ముందు ఆర్నణీయిచ్చి పంపారుకదా?" అంటూ యివతలికి చక్కా వచ్చింది.

"చూశారా?" అన్నట్టు సోదెమ్మకేసి చూస్తూ జోగమ్మ చిన్నబుచ్చుకుంది.

నాలుక కరుచుకుంటూ యివతలికి వచ్చి "అదేమిటే అలా అన్నావూ?" అంటూ బుగ్గలు నొక్కుకుంది సోదెమ్మ.

తరవాత బుచ్చమ్మా, సోదెమ్మా గోదావరికి వెళ్ళి పోయారు.

౨

అప్పుడే కాఫీహోటలునుంచి వస్తూ, హార్మోనియం చూశాటప్పటికి కూనిరాగంపుట్టగా "యిది తెచ్చావూ? భలేదానివి" అని మురిసిపోతూ చలపతి గదిలో అడుగు పెట్టాడు.

అప్పటికి జోగమ్మ జంతికల భరణి పైకి తీస్తోంది.

"ఇలా కూచోండి. ఒక జంతిక పుచ్చుకుంటారా? అంటూ ఆమె బల్ల ఖాళీ చేసింది.

"ఇప్పుడే యడ్లీ సాంబారూ, కాఫీ పుచ్చుకువచ్చాను" అని ననుకుంటూనే అతను చెయ్యి చాపి తరవాతే కూచున్నాడు.

ఆమె ఒక జంతిక అతని చేతిలో వుంచి వొకటి తన చేతిలో వుంచుకుంది. వెంటనే అతను ఫెళ ఫెళలూ కర కరలూ ప్రారంభం చేశాడు. ఒక చిన్న ముక్క విరిచి నోట వుంచుకొని, పెదవులు కదపకుండా నాజూకుగా నవులుతూ "నాకు కాఫీ తెచ్చిపెడతారా?" అంటూ అతనికి చేరబడి నుంచుం దామె.

"మా అక్కని రానియ్యి" అన్నాడతను.

"ఆవి డెందుకూ?"

"మరి డబ్బులో?"

"మీా రెలా పుచ్చుకు వచ్చారూ?"

"ఎప్పుడూ లేదు గాని, యివాళ తనకి తానే యిచ్చి వెళ్ళింది మా అక్క"

"మీాకు మీా అక్క యివ్వడం ఏమిటీ?"

"నాకేమిటి మానాన్నకేమిటి మా అక్కే యిస్తుంది. ఇనప్పెట్టి తాళాలు మా అక్క దగ్గిరే వుంటాయి"

ఆమె కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"పోనీ, నేనిస్తాను తెచ్చి పెట్టండి"

"త్తే"

ఇలా అంటూ అతను చెయ్యి చాపాడు. ఆమె పెట్టెకేసి రెండడుగులు వేసింది; కాని అంతలో మెరుపులాగ వొక సందేహం తోచి, గభీమని వెనక్కి వచ్చి "యీసంగతి రహస్యంగా వుంచుతారా ?" అంది.

"ఏం, రహస్యం యెందుకూ?"

"నేను కాఫీ పుచ్చుకున్నట్టందరికీ యెందుకు తెలవాలీ"

"మా అక్క అడిగితే ?"

"ఎలా అడుగుతుందీ ?"

"నువ్వు పుచ్చుకోడం చూస్తే ?"

"నే నెవరూ చూసీలాగ పుచ్చుకోను. మీరుకూడా వొకళ్ళు చూసీలాగ తేగూడదు"

"తరవాత తెలిస్తే "నాతో యెందుకు చెప్పావుకా" దని మా అక్క గదుముతుంది బాబూ ?"

అదిరిపడింది జోగమ్మ. ఒక్క క్షణం నివ్వెరపోయింది.

"అయితే మీరు తేనేవద్దు. ఇలా అడిగాననిమాత్రం చెప్పకండేం ?"

"చెబితే యేమీ అనదు లే"

"అనడందాకా యెందుకూ? మీరు చెప్పనే వద్దు. తెలిసిందా?"

దీనికి జవాబు చెప్పక "నీకు ముఖారిరాగంవచ్చునా?" అని అడుగుతూ అతను హార్మోనియం దగ్గిరికి వెళ్ళాడు.

"వచ్చును" అంటూ అతని వెనకాలేవచ్చి "చెప్పకండేం?" అంటూ అతని బుజాలమీద చేతులు వేసి, పక్కవాటుగా మొగంమీద మొగంపెట్టి నుంచుందామె.

"చెల్ మోహనరంగా పాడగలవా?"

"అది నాకు రాదు. కాఫీ సంగతి మీ అక్కతో చెప్పకుండా వుంటారు కాదూ?" అని ఆమె అతని గడ్డం పట్టుకుంది.

"పోనీ "సిరిసిరిమువ్వ" పాడగలవా?"

"అదేమిటండీ, అలాంటి వడుగుతారూ? మీరు నేర్చుకున్నారా యేమిటవి?"

ఇలా అడుగుతూ వెక్క అడుగు వెనక్కి వేసిందామె.

"వో! దంచేసి పాడతాను నేను"

"మీ అక్క నేర్పిందా?"

"బంకప్పలసామి నేర్పాడు నాకు. అలాంటి ట్యూన్లు చాలా వచ్చు నాకు. "అప్పనా తనా మనా" "ఓరోరీ

బుడ్డోడా" "అన్నదరూపాయి డుబ్బులికీ"—నేను పాడతాను నువ్వు వాయించు"

చాలా చురుగ్గా చూసిం దామె. "అలాంటివి నాకు రావు. నేను వాయించలేను" అని చాలా కరుగ్గా కూడా చెప్పింది; కాని అతని కదేమీా అర్థం కాలేదు.

"మరేం వచ్చునూ?" అని మామూలు ధోరణి లోనే అడిగాడు.

"రామ నీ సమానమూ" "రామభక్తీ" "మనసు కరుగ దేమీా?" "ఎంత వేడుకొందునూ?" "సంగీత శాస్త్రజ్ఞానమూ—"

"వోస్! ముసలమ్మ పాటలా? అవెవరి క్కావాలీ యిప్పుడూ?"

అతనికి చాలా చిరాకు వచ్చింది. "వెధవ పల్లె టూళ్ళలో వున్నవాళ్ళ బతు కింతే" అనుకున్నాడు. గిరికీలు కొడుతూ అతని మనస్సులో యెందరో ఫిలిం తారలు మెరిసిపోయారు. "వాళ్ళలాగ పాడగలిగితేనా రాజా?" అని వూరిపోయాడు. అలాగ కానందుకు వుసూరు మనిపోయాడు.

అయినా పాటమీాద సరదా పోక, చివరికి "మా అక్క రాకుండా వొక మట్టు పాడెయ్యి తొరగా"

అంటూ చెయ్యి పట్టుకుని ఆమెని హార్మోనియం కేసి లాగాడు.

జోగమ్మ మనస్సు బేజా రయిపోయింది. చలపతి స్థితి అంతా ఆమెకి తెలిసిపోయింది. ఆడబడుచు దౌర్జన్యా నికి స్వాయం యీ వృద్ధత్వం కూడా చూశాటప్పటి కామె, తల తిరిగి బల్లమీద కూలబడగా, అదేమిటో గ్రహించుకో లేక చలపతి "ఊ. మరి కానియ్యి. తొరగా, మా అక్క వచ్చే వేళ అయిపోతోంది లే మరి" అంటూ ఆమెని లేవదీశాడు.

దీంతో, పుండు మీద కారం చల్లినట్టు కాగా "మీా అక్క వస్తేనేం ?" అని అడుగుతూనే ఆమె అతని బల వంతంవల్ల హార్మోనియం దగ్గిరికి వచ్చింది.

"తిడుతుంది" అంటూ అత నామె చేతిసి హార్మో నియంమీాదకి లాగాడు.

"ఎవర్ని ?"

"ఇలా అడుగుతూ ఆమె చెయ్యి విడిపించుకుంది.

"నిన్నూ నన్నూ కూడానూ"

"మీా రింకా ఆవిడచేత తిట్లు తింటున్నారా ?"

"లేకపోతే చంపెయ్యదూ ?"

మెరుపు కొట్టిన ట్టయి "అంటే ?" అని అడిగిందామె.

"అన్నం పెట్టదు. గుమ్మంలోకి రానివ్వదు"

ఆమెకి మీాది ప్రాణాలు మీాదికే యెగిరిపోయాయి.

ఆమెకి బుచ్చమ్మ యెంత గడ్డు మనిషో తెలుసు; కాని చలపతి యింత మడ్డుమనిషి అని మాత్రం యెరగదు.

చలపతి ద్వారా కొన్నాళ్ళ కయినా బుచ్చమ్మని లొంగతియ్యవచ్చు ననుకుంటూ వచ్చిం దామె; కాని యెలాంటి సన్నివేశమూా ?

కాని యీాస్థితిలో తెల్లబోతే యెలాగా? తాను వేసుకు వచ్చిన యెత్తు యే మవుతుందో కొంతవర కయినా చూడవద్దూా ?

ఇలా అనుకుని ఆమె కన్నీరు రెప్పల్లోనే అప్పళించుకుంది. ధైర్యం చిక్కబట్టుకుని యేదో అనపోయింది; కాని అతను పడనివ్వలేదు.

"తొరగా, తొరగా" అని మళ్ళీ తరిమాడు.

విధిలేకా, మాట రాకా ఆమె హార్మోనియం మాత్రం వాయించసాగింది. "తొలి నే జేసిన పూజాఫలములు" అని యెత్తుకుంది. అయితే, అతని కది నచ్చలేదు.

అతని గానాభిలాష మితిమీారిపోయింది. టుమ్రీాలతో గాని తన తలదిమ్ము పోదనుకున్నాడు. వెంటనే

ఆమె చేతులు తీసిపారేసి, ఆపెట్టె తన వేపుకి తిప్పు కున్నాడు.

పెట్టె స్వాధీనం అయింది; కాని మెట్లు? ఆవుతాన్నా హంలో, బుచ్చమ్మ వచ్చేస్తుం దేమో అన్న ఆకంగా రులో అతని కీసంగతి తోచలేదు.

మొదట, యెడమచేతి శక్తి అంతా వినియోగించి అతను గాలిపోశాడు. ఇంకా పోస్తూనూ వున్నాడు తర వాత, తనకి వచ్చిన ట్యూన్లన్నీ యేకబిగిని వాయిం చెయ్యాలని యేకకాలంలో నాలుగు మెట్లు నొక్కాడు.

ఒక్క ట్యూనూ కూడా మ్రోగలేదు; కాని యేక టాకీని నాలుగు వూరకుక్కలు మాత్రం మొరిగాయి.

"ఛీ" అనిపించింది.

దీనికి సాయం బుచ్చమ్మ వచ్చిన సవ్వడి అయింది.

వెంటనే యెలా వున్న హార్మోనియం అలా వొదిలేసి మండువా వాకట్లోకి వొక్క దూకు దూకేశాడు.

జోగమ్మ అందుకే తెల్లబోతూ వుండగా, బిందె బుజమ్మీద వుంచుకునే యెదురుగా నుంచుని, బిందె బరువుకీ కోపవేగానికీ వూగిసలాడిపోతూ, "మా పరువు తక్కనివ్వవూ? నేను బతికి వున్నంత కాల మయినా ఆర్మణీ కట్టిపెట్టు, తరవాత నువ్వేలాగా భూమ్మీద

మన్నవు లే” అంటూ గింజుకుని, బిందెలో నీళ్ళన్నీ తొణికి వాకట్లో పడిపోయీలాగ పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ నంటింటోకి యెగిరిపోయింది బుచ్చమ్మ.

౬

జోగమ్మ చాలా యిదయిపోయింది.

“ఎందుకూ తిట్టడం? ఆర్మణీ వాయిస్తే యేం తప్పు? ” అని ఆమె మొంతో బాధపడింది.

కానయితే, బుచ్చమ్మ వాలకం వచ్చినప్పణ్నుంచీ తెలుస్తూనే వుంది; కాని అది యింతలో యింతగా ముదిరిపోతుందని ఆమె అనుకోలేదు.

ఆమె తల్లి పూర్ణమ్మ మాత్రం యిది మొదటే గ్రహించేసింది.

పెళ్ళిలో, బుచ్చమ్మ తాను వితంతువయి వుండీన్నీ అన్నిటికీ తానే ముందుకి వస్తూ, ప్రతీదానికీ పెడర్థాలు తియ్యడమూ, కుయుక్తులు పన్నడమూ, చలపతిని ఫలహారానికి రానివ్వక పోవడమూ, అలకమంచంమీద తగని పట్టు పట్టించడమూ, ప్రోల్లో పట్టుచీర మాన్పించి సాదా

చీర యిప్పించడమూ—ఇలాంటివన్నీ పూర్ణమ్మ మరచి పోలేదు.

తరవాత చలపతితో కూడా పండుగులికి వచ్చినప్పుడున్నూ రెండు మూడు మాట్లు బుచ్చమ్మ చేసిన పెంకితనం ఆమె మరిచిపోలేదు.

మొత్తంమీద మొగుడి అప్రయోజకత్వమూ, ఆడబడుచు రాగతనమూ తన కూతురికి ముప్పు తెచ్చిపెడతాయని ఆమె పూర్తిగా గ్రహించే వుంది.

అంచేత ఆమె జోగమ్మని అందుకు తగ్గట్టే తయారు చేసింది.

అసలు, జోగమ్మయినా సిసింద్రీ కాని వేలుజెవుల మనిషి కాదు.

ప్రోల్లో రూపాయి పావలా ఖరీదయిన మిల్లుచీర యిప్పించినప్పణ్ణుంచీ బుచ్చమ్మ అంటే ఆమెకి కావలసినంత గుర్రుగా వుంది.

"తాళాలు నీమామగారి చేతిలో వుండాలి. లేకపోతే నీ మొగుడి దగ్గిర ఉండాలి. అతనికీ చేత కాకపోతే నువ్వు చేసుకుంటావు పెత్తనం. మధ్యని యీ గాలివాన మనిషెవరే?" అని తల్లి చెప్పినమాట ఆమెకిప్పుడు జ్ఞాపకం వచ్చింది.

అయితే, శ్రీలీమాటు వచ్చాటప్పటికే కథ యిలా అడ్డం తిరిగిపోయింది కదా యేమిటి దానికి?

బుచ్చమ్మకి స్థానబలం వుంది. తండ్రిబలం వుంది. తమ్ముడి బలమున్నూ వుంది. ఇరుగు పొరుగుల ఆసరా కూడా వుంది.

మరి తన కేం వుందీ?

వచ్చి రావడంతోటే కజ్జాకి సిద్ధపడితే, తరవాత జయంమాట యెలా వుండినా, ముందు లోకులు పీకే య్యరూ? చివరికే యిరుగుపొరుగు ముసలమ్మ అయినా తనకి ఆసరా అవుతుందన్న భరవసా లేకప్పుడు, యిక న్యాయం తన దయితే మాత్రం యేమి లాభమూ?

జోగమ్మ యింతా ఆలోచించింది. దురదృష్టపు రోజు లెన్నాళ్ళో అన్నాళ్ళూ పడక తప్ప దనుకుంది. ఈనిశ్చయంతో, బుచ్చమ్మ యెన్ని మాట లన్నా, యెలాంటి మాట లన్నా జవాబు చెప్పడం మానుకుంది.

కాని, వచ్చిన మూడో నాటి రాత్రి, యిక పడు కోడమే తరవాయి అయి వున్నప్పుడు, బుచ్చమ్మ "ఇవాళ రంగూన్ రౌడీ నాటకం ట కాదూ? చూడా లని లేదుట్రా తమ్ముడూ?" అని అంటించి, యెరగనివాణ్ణి రెచ్చకొట్టి, అర్ధరూపాయికాసు చేతిలో పెట్టి, చలపతిని

పంపగా, అప్పుడు మాత్రం బేలపోయి వెక్కి గంటసేపు కుమిలి కుమిలి యేడ్చిం దామె.

ఆదుఃఖం కొత్త గోదావరి వరదఅంత వులకంగా వచ్చింది. గజగజ లాడించేసింది. ఇటూ అటూ విసిరేసింది. సుడిగుండాలలో తిప్పితిప్పి కొట్టింది. అడుక్కంటా ముంచేసింది. ఆకాశాని కంటా యెగరకొట్టేసింది.

కాని, ఓవరికి మాత్రం ఆమె జాలతనాన్ని కొట్టుకు చక్కా పోయింది.

తరవాత, చలపతి, మూడున్నర కింటికి వచ్చాడు. అతగాడు తలుపు గుంజడమూ, బుచ్చమ్మ తలుపు తియ్యడమూ, "నీ కిప్పుడు నాటకా లేమిటి నాయనా" అని జగ్గయ్య కూక లెయ్యడమూ క్రమంగా జరిగిపోయాయి.

ఈసందడివల్ల నిద్రాభంగం కాగా, మొగు డింటోకి వస్తాడు కదా అని, జోగమ్మ, చడీ చప్పుడూ కాకుండా గడియ తీసి వుంచింది.

కాని బుచ్చమ్మ వుక్రోషం అంతటితో తీర లేదు.

ఆమె, చలపతిని తన మంచం మీద పడుకో మని, తాను వెళ్లి కొంగు పరుచుకుని కవాచీబల్లమీద పడుకుంది.

జోగమ్మ బయట చేరింది కామోసనుకుని పడుకునీ

పడుకోడంతోటే కళ్ళు మూసుకుని సుఖంగా నిద్రపోయాడు చలపతి.

అప్పుడు కూడా వృత్తరవరద లాగ జోగమ్మకి కొంచెం వుడుకుమోత్తనం వచ్చింది; కాని తనే తుమ్ముకుని తనే దీవించుకున్నట్టు, ఆమె, కొంతసేపటికి తన్ను తానే వోదార్చుకుంది.

ఓదార్చుకుని, కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ గోడవేపుకి తిరిగి పడుకుని ఆమే ఆలోచన మొదలుపెట్టింది.

"దీనికి వుపాయం యేమిటి ?"

ఆమె సంగతి యిలా యెత్తుకుంది; కాని దీనికి జవాబు తోచడానికి బదులు "నీయింటో మాయ బుచ్చమ్మకి పెత్తనం యెలా వచ్చిందీ ?" అని యెవరో మొదలకిం విన ట్టయింది.

నిజమే. ఎలా వచ్చిందీ ?

చలపతి తులసీదాసు కనక. జగ్గయ్య వెర్రిబాగుల వాడు కనక. ఇప్పటికి ఆయింటో యిలా ఆలోచించిన వారు లేకపోయారు కనక.

అయితే ఇప్పుడు చెయ్యవలసిం దేమిటీ మరీ ?

ముందు బుచ్చమ్మనీ, చలపతినీ విడతియ్యటం. అతన్ని తాను లోపు చేసుకోవడం.

కొంతవరకేనా యిది సాధ్యపడితే కాలికి నేల అందుతుంది.

తరవాత జగ్గయ్యకి కూతురిమీదే ప్రేమవుందో, తన మీదే వాత్సల్యం వుందో కనిపెట్టడం.

అతను కూతురి పక్షంగానే వుంటే, సేవ చేసి, పూజ చేసి, కాళ్ళు కడిగి దాహం పుచ్చుకుని, తన తెలివి తేటలూ జాగ్రత్తా కనపరిచి, బుచ్చమ్మ రాగతనం గ్రహించేటట్టున్నా చేసి అతని హృదయం తన వేపుకి తిప్పుకోవడం.

ఈ యిబ్బంది లేకపోతే, అతనిచేత చలపతికి ఘాట యిన వొక మోతా దిప్పించడం.

ఈ కార్యక్రమం జోగమ్మకి ధైర్యం కలిగించింది. ముందు, ఆందోళన తగ్గించింది.

అంచేత, నాలుగుంబా వయాటప్పటికి జోగమ్మకి మళ్ళీ మంచి నిద్ర పట్టింది.

## ౧౦

జోగమ్మ చదరంగపెత్తులు మొదలుపెట్టింది.

కాని రెండు దినాలకే బుచ్చమ్మ కనిపెట్టేసింది.

జోగమ్మా చలపతీ ఏకం అయితే యిక తన కేం వుంటుంది? నిజానికి అదే ధర్మం అయినా తాను "మహావర్తి ముండ" గా మాత్రమే వుండడం బుచ్చమ్మ కిష్టం లేదు. ఇంటి పెత్తనం అంతా తానే చెయ్యా లనీ, చలపతికి ముకుదాళ్లు పోసి అవి తన చేతిలోనే వుంచుకోవా లనీ, జోగమ్మని ముప్పతిప్పలూ పెట్టి మూడు చెరువుల నీళ్ళూ తాగించా లనీ ఆమె వొట్టు పెట్టుకుంది.

"ఇంట పుట్టిన నేనుండగా, పైనుంచి కొట్టుకువచ్చిన పీనుగా పెత్తనం చెయ్యడం? బతికి వుండగా యిది జరగ నివ్వకూడదు" అంటూ ఆమె దృఢనిశ్చయం చేసుకుంది.

"చూస్తూవుండు నిన్నేంచేస్తానో" అంటూ జోగమ్మని వుద్దేశించి పళ్లు పటపటలాడించింది.

చలపతి మొదణ్ణుంచీ తన చెప్పుచేతల్లోనే వుండడం వల్ల "తమ్ముడు నామాటే వింటా" డని నిరుకుపరుచుకుంది; కాని తరవాత యెటొచ్చి యెటుపోతుందో అని చూపంతా అటే వుంచింది.

ఒకనాడు, జోగమ్మ నూతిపెరట్లో నీళ్ళుపోసుకుంటూ వున్న సమయం కనిపెట్టి చలపతిని చాటుకి తీసుకువెళ్ళి "పెళ్ళాంతో పగ లెప్పుడూ మాట్లాడగూడ" దని వొక ధర్మోపదేశంచేసింది బుచ్చమ్మ. తరవాత "కోడి కూసింది మొదలు వూరు మాటు మణిగే దాకా రాజుల యిళ్ళ మొగుడూ పెళ్ళా లొకరి కళ్ళ వొకరు పడరు. గొప్ప వాళ్ళ మర్యాదలవి. మనం వైదీకులమే అయినా రాచ కొమారుడు లాగున్నావు నీకేం తక్కువా ?" అని వుబ్బేసింది. చివరికి "సాయంత్రం మనం యిద్దరమూ బజారుకి వెళ్ళి వొక మేజా, వొక కుర్చీ, వొక సిరాబుడ్డీ, వొక కలమూ, నాలుగు కాపీ బుక్కులూ కొనుక్కు వద్దాం. నువ్వు పగ లస్తమానమూ దొరగారిలాగ వీధి గదిలో కచేరీ చేసుకుంటూ వుండు. నెలకొక రూపాయ యిస్తే నీదగ్గిర ఆపనీ యీపని చెయ్యడాని కుంటుంది, వొకసూద్ర పిల్లని నీదగ్గిర నౌకరుగా పెట్టేస్తాను. ఇంతలో నీకు కూతురు పుడితే అదే యెత్తుకుని ఆడిస్తూవుంటుంది; కాని నేను పిలిస్తే తప్ప మరెవరు పిలిచినా నువ్వింటోకి వస్తూ వుండగూడదు సుమా" అని వూరించినట్టే వూరించి ముందరి కాళ్ళకి బంధం వేసింది

ఇదంతా పొద్దున్న జరిగింది.

కాని, యిదేమీ యెరగని జోగమ్మ, ఆవేళ మధ్యాహ్నం మూడుగంటలవేళ, తల దువ్వుదామని సన్నచేసి చలపతిని యింటోకి పిలిచింది. చలపతి మెల్లిగా బయలుదేరాడు. అతను గదిలోకి వచ్చీ రావడంతోటే తలుపులు వేసేద్దామనుకుని జోగమ్మ రెక్కతలుపొకటి పట్టుకుని సిద్ధంగా వుంచుంది.

కాని పడమటింటో కిటికీదగ్గిర నుంచునిసన్న బుచ్చమ్మ యిదంతా కనిపెట్టేసి, "యిప్పుడే వెదుదువుగాని వ్రైకమాటిలా రా తమ్ముడూ" అంటూ గారంగా పిలిచి, యేమిటేమిటో అంతరమంతరపు గొడవలు చెబుతూ వంటింటి పెరట్లో కూచోబెట్టి, "అదేమిట్రా రోడ్డుబూడిద అంతా నీతల్లోనే వుందీ ?" అంటూ జాలి కనపరిచి, తనే తల దువ్వేసి "యిక వెళ్ళు అదెందుకో పిలిచిన్నట్టుంది పాపం" అని పంపేసింది.

మన్నాడు, పిల్లికంటేనూ నేర్పుగా వెనువు వేసుకుక్కచుని, గదిలోకి రమ్మని చలపతికి కన్ను గీటింది జోగమ్మ. "మాట చెబుతా, కూచోండి" అంటూ రెండు రెక్కలూ పట్టుకుక్కచోపెట్టి, బొట్టుపెట్టెలో నుంచి దువ్వెన్న తీసి సిద్ధంగా వుంచుకుని నూనె సీసా అందుకుంది.

మినపసున్నో, జంతికలో పెడుతుందని వురకలు వేసు కుంటూ వచ్చిన చలపతి, చివరికయినా పెట్టకపోతుందా అని నోరూరుతూ కూచున్నాడు.

కాని బుచ్చమ్మ యిదికూడా కనిపెట్టేసింది.

ఒక్క గంతుతో గది గుమ్మంలోకి వెళ్లి, యెంత సేపణ్ణుంచో, యెంతగట్టిగానో పిలుస్తూ వుండినట్టు చుర చుర లాడుతూ "యెంత చించుకున్నా పలక వేమిటే మా తల్లీ ?" అని రుంజుకుని, వెంటనే జోగమ్మని యివతలికి రప్పించింది.

జోగమ్మ మెల్లిగానే వచ్చింది; కాని "యేం మించి పోయిందీ ?" అన్నట్టు చురుకూ చురుకూ చూసింది.

మించీ పోలేదు, అసలు పనీ లేదు; కాని తెల్లపోతే యెలాగా ? కూడా రమ్మని, మొదట జోగమ్మని వుత్తరపు వసారాలోకి తీసుకు వెళ్లింది బుచ్చమ్మ. ఇలాగా అలాగా చూసి, వోక స్తంభం దగ్గిర చీపురుకట్ట పడి వుండగా "యిది యిక్కడేనా పడెయ్యడం ?" అని అడిగింది.

జోగమ్మ వుగ్రురా లయిపోయింది; కాని నిదానించి "మరేం చెయ్యాలి ?" అని అడిగింది.

"అక్కడ గాది సావిట్లో మానాన్న మంచమా ? ఎదు రుగా యిక్కడ చీపురుకట్టా ?"

"మరెక్కడ పడెయ్యాలి ?"

ఒక్కమాటు పులుకూ పులుకూ చూసి "అక్కడా" అని మూల గది చూపించింది బుచ్చమ్మ.

వెంటనే జోగమ్మ "యిదిగో" అంటూ చీపురు పుచ్చుకుని ఆమూలకి వెళ్లి "యిక్కడ పడేశాను" అని పడేసి, గబగబా యెదటికి వచ్చి "యింకేమిటి ?" అని వెటకారంగా అడిగింది.

బుచ్చమ్మ అది గ్రహించకపోలేదు; కాని "తొందర పడకోయ్ పప్పా" అని మనస్సులో అనుకుంది.

ఈవ్యవధానంలో ఆమె అలాంటివే యింకో రెండు పనులు కల్పించుకోగలిగింది. కనక వెంటనే "అదిగో అదీ" "ఇదిగో యిదీ" అని ఆ రెండు పనులూ జోగమ్మకి పురమాయించింది.

అవి అందుకునేటప్పటికి మరో రెండు కనిపెట్టింది. ఆ మొదటివే అవుతూ వుండగా మరొకటి వూహించింది.

అయితే, పనిమీద పని కల్పించడంలోనూ, పురమాయించడంలోనూ కూడాకూడా తిరగవలసిరావడంవల్ల బుచ్చమ్మ కూడా చలపతికి తల వువ్వలేకపోయింది.

దీనికి సాయం, యిందులో వున్న కుట్ర అంతా జోగమ్మ కనిపెట్టేసింది.

దాంతో, చెప్పింది వినిపించుకోకుండా వికటప్రశ్నలు వేస్తూ, తాను చేసిం దల్లా మళ్లీ బుచ్చమ్మ చేసుకుంటేగాని వీలు లేనట్టు తికమకగా చేస్తూ, "ఆకసింత పనికీ అంత సేపుటే?" అని ఆమె సాగతీసుకుంటే, "అయ్యో, వస్తున్నానా మరి? నేనేం కూచో లేదుగదా? చేస్తున్నానా?'' అని అంతకంటె సాగతీసుకుని మరింత ఆలస్యం చేస్తూ తిప్పితిప్పి కొట్టింది.

ఈసందట్లో ఖరాగా వొక్క గంట కాలం గడిచిపోయింది; కాని గుడ్డిగవ్వంత ప్రయోజనం కలగలేదు.

అంతట "యిది కాదు వుపాయం'' అనుకుని, బుచ్చమ్మ "వొరే తమ్ముడోయ్! మొన్న ననగా సుభద్రమ్మ వదినతో వొకమాట చెప్పానురా. దాని మొగం మండిపోను, యెంత తొందర అని చెప్పినా మళ్ళీ యిప్పటికీ కనబడిందే కాదురా అదీ! మళ్లీ జన్మకి నీకడుపున పుడతాను గానీ, వొక్క మాటు ఆలకట్టు తోటకి వెళ్లి దాన్ని వోమాటు రమ్మని చెప్పిరా నాయనా! ఇప్పుడు వీలు లేదంటే రేపు మధ్యాహ్నం అయినా తప్పకుండా రమ్మని చెప్పేం?'' అంటూ రెక్కపట్టుకుని వీధిలోకి తీసుకువెళ్లి చలపతిని పంపేసి చక్కావచ్చింది.

దీంతో అంతా సద్దుకుంది. ఇద్దరికీ ఫ్రాపెరి తిరిగింది.

ఇద్దరికీ సావకాశం చిక్కింది.

వెంటనే బుచ్చమ్మ అక్కణ్ణుంచే పక్కయింటికి వెళ్ళి పోయి సోమెమ్మతో కభుర్లు విడేసింది.

జోగమ్మ, వెనకవాటున బుచ్చమ్మగుండెలు దూసుకు పోయేటట్టు చురుకూ చురుకూ చూసి, యీసడించి కొట్టి నట్టు భడీమని తలుపు వేసేసి, యిదులో తనకి కూడా వొక విధమైన విజయం వుండడంవల్ల పొంగిపోతూ గది లోకి వెళ్ళి, లక్షణంగా ఫలహారంచేసి, కమ్మగా తాంబూ లం వేసుకుని, కాలిమీద కాలు వేసుకుని దర్జాగా పడు కుని, 'వీరేశలింగంగారి' సత్యవతీచరిత్ర చదువుకోసాగింది.

## ౧౧

ఆవేళ రాత్రి, గదిలోకి వచ్చాక, మీద మీదికి వెళ్ళి నుంచుని, చలపతి ముంగుర్లు సవరిస్తూ "తల దువ్వుతాను కూచోండి" అంది జోగమ్మ.

"ఇప్పుడా ?" అన్నాడు చలపతి.

"అవును. అయితే యేం ?"

"పగలు—"

"పగలు మీకు తీరుబడేదీ పాపం ? ఇవాళ ఆల్కట్టు

తోటకి వెళ్ళారా? రేపు ఆర్యాపురమో, దానవాయి గుంటో, వీరభద్రపురమో, సీతంపేటో, చివరికి హుకుం పేటో —"

"రాత్రి తల దువ్వుకుంటే బోగం పుట్టుక వస్తుందిట కాదూ?"

"ఇంతకంటే మీ కదే నయం. అయినా, ఆజన్మలో కూడా మీఅక్క మీకు అక్క అయే పుడుతుంది బెంగ పెట్టుకోకండి"

అతను మొగం వంచుకున్నాడు.

"కాకపోయినా, మీ అక్కలాగ అయి మూడేపాపిడి తియ్యడం నాచేతగాదు గాని—క్షణం"

ఇలా అని ఆమె, దీపం హెచ్చించి ట్రంకుమీద పెట్టి, దాని కెదురుగా అతన్ని కుర్చీపీటమీద కూచోపెట్టి, పెద్ద బెళువారీ అద్దం చేతికిచ్చి నూనెసీసా దువ్వెన్నా తీసుకు వచ్చింది.

బుచ్చమ్మ తలదువ్వితే యెప్పుడూ అద్దం చేతికివ్వదు. అతను తరవాత చూసుకున్నా, అది యింత పెద్దదీ కాదు, యింత మంచిదీ కాదు, యింత చక్కనిదీ కాదూ.

పైగా, దానికి చట్టమే లేదు.

"కళాయి పోతోంది నాన్నా" అంటూ బుచ్చమ్మ

యెన్నాళ్ళో పోరగా పోరగా, జగ్గయ్య, అది తాటాకు పెట్టి మూత్రలో బిగించి కట్టాడు. దానికొక నులకతాడు ముక్క కట్టాడు. అది వేళ్ళాడ వెయ్యడానికి వంటింటి గుమ్మం పక్కని వొక వాసం మేకు కూడా కొట్టాడు.

అద్దం సంగతి యిలా వుండగా జోగమ్మ తెచ్చిన నూనె మామూలుగా నల్లగా కాక యెర్రగా వుంది. మూత తీసి ఆమె చేతిలో వేసుకున్నప్పుడు ఘుమఘుమ లాడింది. అది తలకి రాసినప్పుడు అతనికి పాతముక్కు పోయి కొత్తముక్కు వచ్చినట్టయింది.

బుచ్చెమ్మ తల దువ్వితే చెవులూ, ముహమూ నూనె మరకలతో నిండిపోతాయి. ఎక్కడో వొకచోట దువ్వెన్న తప్పకుండా గీసుకుపోతుంది.

జోగమ్మ అలా కాక చాలా జాగ్రత్తగా నూనె రాసింది. దువ్వడంలో కూడా చాలా నాజూకుతనం కనపడింది. ఇంతే కాక. ఆపెద్ద అద్దంలో వొకదాన్ని వొకటి రాసుకుంటూ వున్నట్టు యిద్దరి మొగాలూ యించక్క కనపడుతున్నాయి.

ఇంకో విశేషం యేమిటంటే ?

మధ్యమధ్య మీదకి వాల్తూ, చెవిలో నోరు పెట్టి "యిలాగేనా తల దువ్వడం ?" అని వోమాటూ,

"ఎక్కడేనా దువ్వెన్న గీసుకుపోయిందా యేమిటి బాబూ ?" అని వొకమాటూ, "ముచ్చటముడి వెయ్యనా ?" అని యింకొకమాటూ, "రేపణ్ణుంచి కాకిలాగ గోదావరిలో మునిగి చక్కా వస్తూ వుండకండి. మీా అక్క గోదావరికి వెళ్లాక, వినోలియా సబ్బుతో వొళ్లు తోమి నేను స్నానం చేయిస్తా"నని మరొకమాటూ— ఇలాగ మెల్లిమెల్లిగా యేమిటేమిటో చెబుతూ, నవ్విస్తూ తుళ్లిస్తూ, వుండుండి బుగ్గలికి పెదవులు తగిలిస్తూ, చక్కలిగిల్లి పెట్టి వూపేస్తూ, చిరునవ్వుతో మొకం కవ్విస్తూ, జంకెనచూపులతో చురుకు పుట్టిస్తూ ఆమె కొత్త ప్రపంచకంలో తిప్పేసింది.

తరవాత తాను సబ్బుతో చేతులు కడుక్కువచ్చి తడిగుడ్డతో మెల్లిగా మొగం తుడిచింది. కమ్మని స్నో రాస్తూ మొగం అంతా నిమిరింది. అంటీ అంటకుండా బుగ్గలికి పౌడ రద్దింది.

పాందాను మూతలో సిద్ధంగా వున్న తమలపాకు చిలక లెడమచేత్తో పుచ్చుకుని, వక్కపొడి వేసి రెండు మూడు చిలక లతని నోటి కందించి, తన నోట కూడా వుంచుకుని, "నాకు కాస్త చోటివ్వండి" అంటూ సుతారంగా బుజంమీాద పొడిచింది.

యితే, వొక్క మనిషికే చాలీ చాలని పీట అది. ఈసంగతి ఆమెకీ తెలుసు. జరుగుదా మనుకుని చోటు లేక అతను తెల్లపోవడంకూడా ఆమె గ్రహించేసింది. వెంటనే "పోనీలెండి......ఏం ?" అంటూ వొళ్ళో కూచుంది.

అందుకే అతను పరవశు డయిపోగా, యెడమచెయ్యి అతని మెడకి చుట్టవేసి, వొక చిలక తీసి తన నోట సగం వుంచుకుని "ఊఁ, ఊఁ" అని పావురంలాగ గుబాళిస్తూ ఆనోటితోటే తక్కిన సగమూ అతని నోటి కందించింది.

౧౨

తెల్లవారాక, అలాగా యిలాగా వెళ్ళడంలో, చలపతి వొకమాటు బుచ్చమ్మ పక్కగా వెళ్ళాడు. ఆమె కేదో కమ్మని సువాసన తగిలింది. దాంతో సంగతంతా పసి కట్టేసి, వెంటనే నీళ్ళపొయిమీద డేకిసా పడేసి, చలపతికి తలంటు మొదలుపెట్టింది.

అది చూసి "వోసి నీబుద్ధి బుగ్గయిపోనూ" అని తిట్టుకుంటూ జోగమ్మ, గదిలోకి చక్కాపోయింది.

తలమీద నూనె పెడుతూ "రాత్రి తల దువ్వించు కున్నావా యేమిట్రా ?" అని అడిగింది బుచ్చమ్మ.

తెల్లపోయి "అదే దువ్వింది" అంటూ ముడుచుకు పోయాడు చలపతి.

"నే నెరగనూ ? దానిపనే యిదీ. అచ్చంగా సాని పాపే మాతల్లి"

తన్నే మంటుందో అని భయపడ్డా డతను.

"నువ్వెలా ఒప్పుకున్నా వబ్బాయీ ?"

కళ్లు మూసుకున్నాడు.

"రాత్రి నువ్వొకుంటే భోగంజన్మ వస్తుంది, యింకె ప్పుడూ అలా చెయ్యనివ్వకు వెర్రినాయనా !"

కుదుటపడ్డాడు. పైగా, రాత్రి జోగమ్మ అన్నమాట జ్ఞాపకం రాగా సాహసించి "మొగాడికి ఆడజన్మ యెలా వస్తుందే ?" అని అడిగాడు.

"ఏం రాకా ? దేవుడికి ఆడా మొగా భేదం వుందను కున్నావా యేమిటి ? నీ పెళ్ళాం వెనకటి జన్మలో మొగాడు కాక ఆడదనుకున్నావా యేమిటి ?"

అతని శరీరం కొంచెం వణికినట్టయింది.

"కాకపోయినా, భోగం యింటో మొగాడయి పుట్టి తిత్తి వూదే యోగం పడితే ?"

గతుక్కు మనిపోయాడు చలపతి.

బుచ్చమ్మ అది గ్రహించేసింది. దాంతో బరితెగి "తెలిసిందంటే నువ్వేనా చెప్పావుకావేం? అని నాన్న నన్ను తిడతాడు" అంటూ అందుకుందామె.

"దువ్వినవాళ్ళు బాగానే వుంటారు, మధ్య యేమీ యెరగని నాకూ చివాట్లూ చెప్పుదెబ్బలూనూ. పెత్తనం చేసి నేనేమీ బామకోడం లేదు. ఇలాగ కుటుంబ మర్యాద నిలుపుకోడానికి నే నెన్నిపాట్లు పడుతున్నానో భగవంతుడి కెరుక. అమ్మ చూసుకోవలసినవి యివన్నీనీ. అలోమని యేడుస్తూ మూలపడి వుండకుండా యీభారం అంతా నామీద పడిపోయింది. ఇనపగజ్జెల తల్లి యింటో అడుగు పెట్టింది, అమ్మ యెలా తక్కుతుందీ మనకి?"

ఈమాట జోగమ్మ విందేమో అని బెదురుతూ ఆమె నాలుగువేపులా చూసింది.

ఈఅవకాశంలో చలపతికి రాత్రి చర్య అంతా జ్ఞాపకం వచ్చింది. "జోగమ్మ యినపగజ్జెల తల్లి అయి వుంటే అన్ని విలాసాలు చూపించగలదేం?" అని యెవరో బుగ్గలు పొడిచినట్టయింది.

సిగ్గుపడ్డా డతను. బుచ్చమ్మమీద కోపం వచ్చింది. "అది యినపగజ్జెల తల్లి అయితే మరి నువ్వెవరే?" అని

అడిగేద్దా మనుకున్నాను; కాని ధైర్యం చాలింది కాదు.

చివరికి "నీయిష్టం వచ్చిన ట్టనుకో" అని చెప్పు లప్పగించేసి వూరుకున్నాను.

తరవాత నాలుగైదు మాట లని, అందులో వొకటి రెండు ప్రశ్నార్థకా లయినా జవాబులు రాకపోవడం చూసి, "తమ్ముడికి బుద్ధి వచ్చింది" అనుకుని బుచ్చమ్మ కూడా వూరుకుంది.

నో రెప్పుడు వూరుకుందో అక్కడి నరాల్లో పుట్టిన కదలిక అంతా ఆమె చేతినరాల్లోకి జరిగి అయిపోయింది.

వెంటనే ఆమెకి చురుకు యెక్కువయిపోయింది.

అంతట, పాళాలు కనిపెట్టే అలవాటు లేక వొక మాటు మరుగునీళ్లు పోసీ, తన చెయ్యే చురుక్కు మనగా మరోకమాటు చప్పని చన్నీళ్ళు పోసీ, మెడ బెణికేటట్టు దులిపీ, పెంకులు తీసెయ్యకుండా కుంకుళ్ళ పిప్పితో నొక్కి వొళ్ళు తోమీ మరో నాలుగు నిమిషాలికి తలంటు పూర్తి చేసేసింది.

వాకట్లో గడియారం యెనిమిది కొట్టింది.

దాంతో గోదావరి జ్ఞాపకం రాగా కంగారు పట్టుకుంది.

వెంటనే బిందె పుచ్చుకుని బయలుదేరింది; కాని

వాకట్లోకి వచ్చాటప్పటికి, జోగమ్మ చలపతి కేం విరుగుడు మాటలు చెప్పిపోతుందో అని అనుమానం పుట్టి యెక్కడ లేని ఆపేక్షా కనపరుస్తూ "గోదావరికి వెడదాం రావే మరదలా" అంటూ మెల్లిగా పిలిచింది జోగమ్మని.

అది విని "యిప్పుడు నాతరవాయి వచ్చిందా ?" అనుకుంది జోగమ్మ. "గోదావరి కాదు, నీకు తగింది కొల్లేరు" అని పళ్ళు కొరుక్కుంది. "మాటలు పెరిగితే చివరి కేమయినా సరే కలిపేస్తాను" అని నిశ్చయించుకుని కొంచెం దురుసుగానే యివతలికి వచ్చింది.

"గోదావరికి వెడదాం రా" అని మళ్ళీ పిలిచింది బుచ్చమ్మ.

"నేను–రాను" అని బుంగమూతి పెట్టుకుని కచ్చితంగా చెప్పేసింది జోగమ్మ.

"అదేమే మాతల్లీ ?"

"గోదావరిలో దిగితే నాకు జబ్బు చేస్తుంది బాబూ"

"ఏం వులకం మాటలు చెబుతావే? ఇవాళ యేకాదశి. సముద్రం అంత గోదావరి వుండగా, యివాళ యే బ్రాహ్మణ ఆడ దయినా యింటో నూతిదగ్గిర నీళ్ళు పోసుకుంటుందా యీవూళ్ళోనూ ?"

ఈమాటకి జవాబు చెప్పలేక జోగమ్మ తెల్లపోతుం

దనీ, పుచ్చినట్టు తన కూడా వస్తుం దనీ అనుకుంది బుచ్చమ్మ; కాని "అయితే యేకాదశి పూటా మీరు మీ తమ్ముడికి తలంటి పోశారేం మరీ?" అని జోగమ్మ నెత్తిమీద మొత్తిన ట్టడిగింది.

ఈమాటకి బుచ్చమ్మ కొయ్యయిపోయింది. ఆమె మొగంమీద కత్తివేస్తే నెత్తురుచుక్క లేకుండాపోయింది.

నిజంగా ఆమెకి చచ్చిన చావయిపోయింది.

దీనికి సాయం, గాది సావిట్లో జంధ్యాలు వొడుక్కుంటూ వున్న జగ్గయ్య "అలవాటు లేకపోతే జబ్బు చేస్తుంది, పాపం దాన్ని బలవంతపెట్టి గోదావరికి తీసుకు వెళ్ళకే అమ్మాయీ" అని కొంచెం గదుముతూ కేకేశాడు.

## ౧౩

ఆవేళ మధ్యాహ్నం, తల దువ్వించుకుందామని ముచ్చటపడి, చలపతే సొంతంగా గదిలోకి బయలుదేరాడు.

కాని సరిగా అదే సమయాన పరికరాలతో వచ్చి, అతన్ని వెుడుపేసి పట్టుకున్నట్టు వాకట్లోనే కూచో పెట్టి తల దువ్వసాగింది బుచ్చమ్మ.

అక్కడ చలపతికి ముచ్చట అయినట్టే "యీపాటికి పిలుద్దాం" అని యిక్కడ జోగమ్మకి సంకల్పం కలిగింది.

వెంటనే కరికరాలు పసకగది వసారాలో పెట్టి మెల్లిగా బయలుదేరింది; కాని వాకట్లో అడుగు పెట్టేటప్పటికిదీ కథ.

దాంతో, వాళ్ళు తిరిగి విసిరేసినట్టయి జోగమ్మ ఆపక్కనే వున్న స్తంభానికి చేరబడిపోయింది.

ఇది గ్రహించి బుచ్చమ్మ మరీ మొండికెత్తి "యెప్పుడూ లేంది, నిక్షేపం వంటి జుట్టు, యిలాగ కుచ్చులు కుచ్చులుగా వూడిపోతోంది, దిక్కుమాలిన బజారు కంపునూనె లేమయినా తగులుతున్నాయూ యేమిటి బుల్లోడా?" అని వోరచూపులు చూస్తూ ముదలకించింది.

ఇది విని జోగమ్మ, పెదవులు విరుచుకునీ, మెడ బిగించుకునీ, తల అడ్డంగా తాటించుకుంటూ వుండగా, పిలిచినట్టు పెత్తనాలకి వచ్చింది సోదెమ్మ.

"ఏదో భాగోతం జరుగుతోం"దని గ్రహించుకుంది; గాని మన కెందుకని సోదెమ్మ వెనక్కి వెళ్ళలేకపోయింది.

కానయితే "రావే" అని బుచ్చమ్మా ఆహ్వానించలేదూ, "రండి" అని జోగమ్మా స్వాగతం చెప్పలేదూ. అయినా ఆమె ముందుకే వచ్చేసింది.

కూచుంటూ కూచుంటూ ఆమె జోగమ్మ కేసి చూసింగా, జోగమ్మ ఆమె కేసి చూసింది.

ఆచూపులతో మనస్సు కరిగిపోగా, దెబ్బతిన్న లేడి లాగ సోదెమ్మ చతికిలబడిపోయింది.

ఆచూపులతో గాయం రేగినట్టు కాగా, చూపులతోటే బుచ్చమ్మ మీద మెటికలు విరిచి, మూతి బిడాయించుకుని, తిరిగితిరిగి చూస్తూ జోగమ్మ గదిలోకి చక్కాపోయింది.

బుచ్చమ్మలాగే సోదెమ్మ కూడా బాలవితంతువే. వారి స్నేహాని కదికూడా ఒక హేతువే. అయితే, సోదెమ్మ హృదయం నిరర్థకం మాత్రమే అయిపోయింది; కాని శూన్యం అయిపోలేదు. నల్లరాయి కూడా అయిపో లేదు.

అది యథారూపంగానే వుంది. నిర్మలంగానే వుంది. ఆర్ద్రంగానే వుంది. స్నిగ్ధంగానే వుంది. విలాసాలకు గనిగా కూడా వుంది.

అయితే, ఆవిలాసా లన్నీ ఆమె తన చెల్లెలికి దఖలు పరిచేస్తుంది.

కొడుకులు లేకపోవడంవల్ల, ఆమె తండ్రి, రెండో అల్లుణ్ని యిల్లరికం తెచ్చిపెట్టుకున్నాడు.

ఆ అల్లుడు మంచి రసికుడే; కాని రెండు చిన్నవాగులు కలిస్తే వొక మహానది అయినట్టు, ఆయిద్దరు తరుణుల విలాసాలూ యేకమయి దుర్ధమాలు కావడంవల్ల తరుచు వుక్కిరిబిక్కి రయిపోతూ వుంటూండతడు.

ఇది యిలా వుండగా: సోదెమ్మకీ చలపతికీ వదినా మరుదుల వరస. అప్పుడప్పు డామె "వెర్రిబాగులవా" డని జాలిపడుతూనే చలపతిని ఆడించేస్తూ వుంటుంది.

కాగా ఆమె అప్పుడు వూరికే కూచోలేక పోయింది. జోగమ్మ చూపులంటుకుని వుండడంవల్ల ఆమె మనొక గొడవకూడా యెత్తుకోలేకపోయింది.

వెంటనే "పెళ్ళాంచేత తల దువ్వించుకోడానికి సిగ్గా యేమిట్రా బావా?" అని ఝుమాయించి అడిగేసింది. దీనికే చలపతి వుల్లాసీదా అయిపోయి వుండగా "చక్కగా పక్కపాపిడి క్రాపింగు పెట్టించుకొక, ఆడపిల్లకి లాగ నీకంత జుట్టేమిట్రా యీ రోజుల్లోనూ?" అని కూడా అనేసింది.

అలాంటప్పుడు వాకట్లోకి పైవాళ్ళు రావడమే బుచ్చమ్మకిష్టం లేదు. అందులోనూ సోదెమ్మ రావడం అసలే యిష్టం లేకపోయింది.

పోనీ అంటే వచ్చింది వచ్చినట్టు కూచోక తల దువ్వ

డంవాట మొత్తుకునేటప్పటి కామెకి పిసాళం మొత్తుకు వచ్చింది. ఆపైని "క్రాపింగు" అనేటప్పటికి వెళ్ళే మం డుకుపోయింది.

దీంతో యిక వూరుకోలేక బుచ్చమ్మ "నా మొగం చూసి అది వూరుకోనప్పుడు దాని మొగంచూసి నేనెందు కూరుకోవాలే? " అనుకుని "ఇంట్లో వున్న ఆడపీనుగులు భయభక్తులూ, సిగ్గు బిడియాలూ వున్నవాళ్ళయితే తగుదునమ్మా అని గజ్జె కట్టుకువచ్చి అంతరమంతర పాళ్లు యిలాగ భాగోతం ఆడగలరా? సిగ్గు కాకపోతేమాత్రం పెళ్ళాంగారు వచ్చాక తక్కినవాళ్ళ సందర్శి తీసిపారె య్యాలా యేమిటి? తల నున్నే దిక్కు లేకపోతే మొగ ముండాకొడుకు క్రాపింగూ పెట్టించుకోక, బోడిగుండూ చేయించుకోక మరేం చేస్తాడూ? గురివిందగింజ తన కున్న నలు పెరగదుట. ఒకళ్ళ యింటి ముచ్చట్లుమాత్రం యింతకంటే బాగావుండి యేడిశాయా? కాకపోయినా కొంతమంది కదేమిటో కళ్ళల్లోనే వుంటుంది విషం" అంటూ విసిరికొట్టింది.

సోదెమ్మ మనస్సు చివుక్కు మంది.

ఆమెకి చాలా అభిమానం వచ్చింది. పేగులు తోడేసి

నట్టు కళ్ళనీళ్ళ పర్యంతమూ అయింది. ఇక అక్కడ కూచోలేకపోయింది.

మొదట పులుకూ పులుకూ చూసి, తరవాత "యాదాలాభంగా అన్న మాట కింత అల్లరేమిటే మాతల్లీ ?" అంటూ వుబ్బెత్తుగా లేచి "తెల్లవారి యెవరి మొగం చూశానో ? " అని పిసుక్కుంటూ వీధి గుమ్మం దాటి "తీరి కూచుని యెంతెంత మాటలు పడవలసి వచ్చిందీ ? " అని పరితపిస్తూ యిల్లు సమీపించి "మరదల్ని చూసి కళ్ళల్లో అంత నిప్పులు పోసుకుంటుందేం ? " అని గొణుక్కుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

"వెళ్ళిపో. నాకేం దిగడిపోతుం దనుకున్నావా ? " అనుకుంది బుచ్చమ్మ.

"అల్లరిట అల్లరి, చూశావా తమ్ముడూ ? గుమ్మంలోకి రానిస్తే యిది యెంతెంత లయినా పుట్టిస్తుంది. నీపెళ్ళానికీ దీనికీ అక్కాచెల్లెళ్ళ వరస కూడానూ. చెల్లెలికి మాయమాటలూ, మంకుతనమూ నేర్పి మరిది నెంత యేడిపిస్తోందో యెరగవూ ? " అని చలపతి చెవిలో వూదింది.

తరవాత జోగమ్మని వుద్దేశించి, ఆగదికేసి చూస్తూ

ఆ టక్కులాడితో మాట్లాడి చూడు నిశ్చయం చేస్తానో ?”
అంటూ పళ్ళు కొరుక్కుంది.

లో గుమ్మంలో పొంచి వుండి జోగమ్మ ఆచెలికత్తెల మాట లన్నీ వింది. చటాలున వెళ్ళి కిటికీలోనుంచి వీధి లోకి తొంగిచూసి సోదెమ్మ వాలకం అంతా కనిపెట్టింది.

వారికిద్దరికీ చలపతిని గురించి విరోధం వచ్చినందుకు పొంగిపోయింది.

## ౧౪

నెల్లాళ్ళలో వస్తామన్న జోగమ్మ తల్లీ తండ్రీ యిర్వై రోజులకే వచ్చారు.

నిజానికవి రోజులే అయినా జోగమ్మకి సంవత్స రాలుగా కనపడ్డాయి.

హారయినా, వుండలేక అయితే నేమి, నెల ఆఖరుకి గాని రాదనుకున్న సెలవు యిరవయ్యో తేదీకే రావడం వల్లనైతే యేమి పిలిచినట్టు వచ్చారు కనక సరిపోయింది; కాని లేకపోతే యెంత బిగపట్టుకున్నా ధైర్యం నిలవక జోగమ్మ బెంబేలు పడిపోయి వుండును.

అక్కడికి పెట్టెలో పెట్టుకు వచ్చిన మినపసున్ని బుట్టా, మిఠాయి బుట్టా పైకి తీస్తూ, తలవని తలంపుగా తన మొగం చూసి "అదేమే మామ్మా అంత కంప అయిపోయావూ ? " అంటూ తల్లి చేతులు చాపాటప్పటికి దుఃఖం వుబ్బెత్తుగా పొంగుకు రాగా, తల్లిమీద వాలి బారుమనిపోయిం దామె.

తరవాత బుచ్చమ్మ వెయ్యికళ్ళతో కనిపెడుతూనే వచ్చింది; కాని సందు చేసుకుని జోగమ్మ యిక్కడి సంగతి అంతా ఆవేళే—మధ్యాహ్నం భోజనాలకి లోపునే తల్లికి చెప్పేసింది.

పూర్ణమ్మకి అరికాలిమంట నెత్తికి వచ్చింది. సగం అయినాక వచ్చి విని వెంకటచలం కూడా చాలా ఆగ్రహపడ్డాడు.

కాని అల్లుడి అప్రయోజకత్వం జ్ఞాపకం వచ్చి "తొందరపడకు" అని ముందు పూర్ణమ్మని శాంతపరచి, "పడ్డన్ని రోజులు పట్టవు తల్లీ, వోపిక పట్టు. మే మిక్కడ పదిహేను రోజు లుందామని వచ్చాము. ఈ లోపున చలపాన్ని దారికి తీసుకురాగలుగుతానా సరే. లేకపోతే ముందు సంగతి అప్పు డాలోచిద్దాం" అని తరవాత

జోగమ్మని ఫ్రూదార్చి వెంటనే తీవ్రాలోచన ప్రారంభించాడు.

ఆవేళ మధ్యాహ్నమే జోగమ్మనీ, చలపతినీ, పూర్ణమ్మనీ వెంటపెట్టుకుని అతను బజారుకి బయలుదేరాడు.

కాని, చలపతి వాళ్ళతో వెళ్లడం బుచ్చమ్మకి సుతరామూ యిష్టం లేదు. అయితే, కూచున్నవారు కూచున్నట్టే వాకట్లోనుంచి బయలుదేరడంవల్ల వద్దనడానికామెకి సంధు చిక్కలేదు. సన్నచేసి అయినా ఆపు చేద్దామని యెంతయినా తంటాలుపడింది; గాని ఆసమయంలో చలపతి బుచ్చమ్మకేసే చూడలేదు.

మళ్ళీ సాయంత్రం అయిదు గంటలవేళ, వెండి, కంచు, ఇత్తడి సామానూ, చిల్లర కర్రసామానూ రెండు బళ్ళతోటీ, పందిరిమంచమూ, బట్టలబీరువా, పీచుపరుపూ, దూదిపరుపూ, మార్బిలుమేజా యేడెనమండుగురు కూలీలచేతా పట్టించుకుని వారింటికి వచ్చారు.

ముందు, మంచం తెచ్చిన కూలీలు గుమ్మంలోకి రాగా వారిని చూసి మూతి ముడుచుకుని బుచ్చమ్మ వంటింటికేసి చక్కాపోయింది.

"మాఅమ్మా, మానాన్నారూ నాకు సారెవస్తువులు కొని యిచ్చారు మామయ్యా" అని జోగమ్మ మురిసి

పోతూ చెప్పగా "జమీందారులు వారిచ్చారన్నా, పెట్టిపుట్టావు నువ్వు తెచ్చుకున్నావన్నా ఆశ్చర్యం యేమిటమ్మా?" అని కోడలితోటీ, "మాయిల్లు పడుతుందా బావగారూ?" అని వెంకటచలంతోటీ అని, పుష్పాంగిపోయి, కూలీలచేతా, బళ్ళవాళ్ళచేతా సామాను తావాకట్లో దింపించాడు జగ్గయ్య.

జాపితాప్రకారం సామానంతా సరిచూసుకుని రెండు జోడాలవారూ నూతికి వెళ్ళి కాళ్ళు కడుక్కుని కసిన్ని కసిన్ని మంచినీళ్ళు పుచ్చుకున్నారు.

మొదట పాతమంచం విప్పి వాకట్లో చేర్చేదాకా కూడా కూడా వుండి, తరవాత, జగ్గయ్య, బుచ్చమ్మని బలవంతాన తీసుకు వచ్చి ఆమె సాయంతో అది పడమటింటో అమరుస్తూ వుండగా, జోగమ్మ సెలవులు అందుకుంటూ, పూర్ణమ్మ సాయం పుచ్చుకుంటూ వెంకటచలమూ, చలపతీ సావుగంటలో కొత్తమంచం అమర్చేశారు.

తక్కిన సామాను కూడా గదిలోకి చేరేదాకా సాయపడి "ఇక నావల్ల కాదమ్మా! కాకపోయినా వియ్యపురాలి నైతిని, మీయింటో నేను చాకిరీ చెయ్యడం యేమిటీ? ఎవరయినా చూస్తే నవ్వపోతారు, సిగ్గుసిగ్గు"

అంటూ చలపతి కేసి వోరచూపులు చూసి, జోగమ్మకి కన్నుగీటి, వాకట్లోకి వచ్చి చతికిలబడి, తరవాత ఆసా మాను సద్దడంలో వొకరి కొకరు సలహాలు చెప్పుకుంటూ, వొకరి కొకరు సాయం చేసుకుంటూ, మధ్యమధ్య వొకొక్కమాటు "నీకు తెలవ" దంటే "మీా రెరగ రండీ" అని వాదించుకుంటూ, "నాకు తోచింది చెప్పా ను. ఆపైని నీయిష్టం" అంటే "నేననుకున్నది చెప్పాను. ఇక మీా మనస్సు సుమండీ" అని మళ్ళీ అంతలో సమా ధానపడుతూ, జోగమ్మా చలపతీ బుజమూ బుజమూ రాసుకుంటూ తిరగడం చూసి, వెంకటచలం కేసి సాకూ తంగా చూసింది పూర్ణమ్మ.

వెంకటచలం ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ కవాచీ బల్లమీాద తువ్వాలు పరుచుకుని నడుం వాల్చాడు.

## ౧౫

"తెచ్చిన వెంటనే వస్తువులు వాడుకుంటే వేరే ముహూర్తం అక్కర్లేదుట" అంది జోగమ్మ.

"అవునుట" అన్నాడు చలపతి.

"కనక ముందు కుర్చీలో కూచోండి" అంటూ చెయ్యి పట్టుకుని అతన్ని తీసుకు వెళ్లిం దామె.

"అది నీకోసం కొన్నారు మీనాన్నగారు. నువ్వు కూచోవాలి కాని నేనా యేమిటి ?" అంటూ నసుకు తూనే అతను దర్జాగా కూచున్నాడు.

"నేను వొట్టి కుర్చీలో కూచుంటానా యేమిటి మొదట ?"

"మ రెలా కూచుంటా వేమిటి ?"

"ఇదిగో యిలాగ"

ఇలా చెబుతూ ఆమె అతని వొడిలో కూచుని, రెండు చేతులూ మెడకి చుట్టేసి బుగ్గా బుగ్గా ఆనించి కువకువ లాడుతూ "తెలిసిందా ? బాగుందా ?" అని అడిగింది.

అతని మనసు తాంబూలంమీదకి పోయింది.

తరవాత అతని మొగంమీద మొగం పెట్టి "రేపు పొద్దున్న మీరు కోరుకున్న కుర్చీ కొంటారుట మా నాన్నారు" అంది జోగమ్మ.

"నీతో చెప్పారా !"

"మా అమ్మా మానాన్నారూ అనుకున్నారు. మా అమ్మ మేజా కూడా కొని యిమ్మంది"

అతని మొగం విప్పారింది.

"మానాన్నారు కొంటా నన్నారు"

"భేష్"

"నేను ఫౌంటెన్ కలం కూడా కొని యిమ్మన్నాను"

"వో! అయితే నే నస్తమానమూ రాసుకుంటూనే కూచుంటాను" అంటూ అత నామెని గట్టిగ కౌగిలించుకున్నాడు; కాని "నువ్వు చదివిన చదువుకి నువ్వేమిటోయ్ రాసేదీ?" అని యెవరో టోకాయించి అడిగిన ట్టయి గతుక్కు మనిపోయాడు.

"అడగడం ధర్మం కాదు గాని— అయినా— సంతోషిద్దా మని సుమండీ! మంచం యెంతకి పుచ్చుకున్నారు భావగారూ?" అని జగ్గమ్మ అడగడమూ, "దాల్లో తప్పేముంది భావగారూ? వస్తువు కంటికి యింపుగా వున్నప్పుడు "కిమ్మత్తెంత?" అన్న ప్రశ్న సహజంగానే వచ్చేస్తుంది. మంచం ప్రత్యేకంగా యెనభై ఆరయింది. పరుపులు రెండూ యిరవై మూడు పైచిల్లర" అని వెంకటచలం జవాబు చెప్పడమూ వాకట్లోనే జరిగాయి; గాని యెంతో దూరంనుంచిలాగ గదిలోకి చల్లగా వినపడ్డాయి.

దానిమీద, వెంటనే కౌగిలి విడిపించుకుని వుక్కుదూకున మంచంమీదకివెళ్ళి వాలి "యెంత మెత్తగా వుందో పరుపు" అంటూ కిలకిల్లాడింది జోగమ్మ.

చలపతి కూడా వెనకాలే వెళ్లి "అవును సుమా"

అని రెండు చేతులతోటీ పరుపు తాకుతూ వుండగా, ఆమె మెడపట్టుకుని అతని మొగం తన మొగంమీదకి తీసుకుంది.

ఒక్క క్షణకాలం నాలుగు పెదవులూ ప్రీతి నెరపుకున్నాయి.

ఆమహాపుణ్యకాలంలో కిచకిచ లాడుతూ రెండు పొట్టి పిచికలు వచ్చి వసారాదూలంమీద వాలాయి.

దక్షిణపు తెరపినుంచి రంయి మని వచ్చి, గోదావరి గాలి, గులాబీపువ్వుల పరిమళంతో ఘ్రాణతర్పణం చేసింది.

కాని, మబ్బు లేని పిడుగు లాగ, వాకట్లోనుంచి, దాని వెనకనే "తమ్ముడూ" అని కఠోరాహ్వానం కూడా వచ్చింది.

జోగమ్మ కడుపులో రాయి పడ్డట్టయింది. అయినా వెంటనే తేరుకుని ఆమె "వెళ్ళకండీ, వెళ్ళకండీ" అంటూ చేతులు మరింత గట్టిగానే బిగించింది; కాని చలపతి ఆపట్టు బలవంతాన విడిపించుకుని దూదిపించెలాగ యెగిరి పోయాడు.

దెబ్బతిన్న ఆడతాచు లాగ లేచి నిప్పులు కక్కుతూ వచ్చి జోగమ్మ గుమ్మంలో ఆగిపోవడం చూసి "చూశా

రా" అన్నట్టు పూర్ణమ్మ వెంకటచలం కేసి చూడగా, "ఇదా సమయం?" అన్నట్టు వెంకటచలం జగ్గయ్య కేసి చూశాడు.

వియ్యాలవారి అస్త్రం జగ్గయ్యని కుదిపేసింది. దాంతో అతను మెరుపుదెబ్బ తిన్నట్టయి "ఇప్పు డేం పనే? వా డెందుకు నాతో చెప్పరాదుటే?" అని చాలా రూక్షంగా అడిగాడు; కాని అప్పటి కప్పుడే ముందు బుచ్చమ్మా, గుడికి మేక లాగ ఆమె వెనక చలపతీ వంటింటి పెరట్లోకి వెళ్ళిపోయారు.

"ఇప్పుడే చూశాను, వుప్పయిపోయింది, పట్టుకు రావాలి" అంది వెనక్కి తిరుగుతూనే బుచ్చమ్మ.

మళ్ళీ వులిక్కిపడి, మాట్టాడలేక చెయ్యి చాపాడు చలపతి.

ఆచేతిలో పడెయ్యడాని కొక అణాకాసు యెత్తి పట్టుకుని "వాళ్ళు రమ్మంటే వెనకా ముందూ చూసు కోకుండా కూడా చక్కాపోతావా?" అని ముందు కళ్ళెర్రచేసి "యేమేం కొన్నా లేమిటి?" అంటూ తరవాతే లాలనగా అడిగిం దామె.

## ౧౬

"వాళ్ళు బయాలుదేరీ దాకా యెందు కూరుకోవాలీ?" అనుకుని, మర్నాడు పొద్దున్న, ముందే జాగ్రత్తపడింది బుచ్చమ్మ.

దీనికి సాయం, ఆవేళ లేచినంత తొరగా యెప్పుడూ లేవలేదు చలపతి.

దంతధావనాదికం పూర్తి చేసుకుని, మళ్ళీ గదిలోకి వెళ్ళి, అతను షర్టు తొడుక్కుంటూ వుండగా జోగమ్మకి మెళుకువ వచ్చింది.

కూనిరాగం తీసుకుంటూ, కోడిగుడ్డు లాంపు వెలుగులోనే నిలువుటద్దం యెదట నుంచుని, అతను తాపీగానే బొత్తాములు పెట్టుకుంటూ వుండినాడు; కాని "యెక్కడికో పంపుతోంది కామోసు భామ" అని ఆత్ర పడుతూ వురికివెళ్ళి రెండు రెక్కలూ పట్టుకుని అతన్ని తన వేపుకి తిప్పుకుని "యేమిటీ యీ సడసం?" అన్నట్టు కళ్ళల్లోకి బాణాలు విసిరిందామె.

"మీరంతా వోట్టి నిద్రమొగా" లన్నట్టు, మొదట, చిరునవ్వు నవ్వుతూ బదులు చూశాడతను. తరవాత "చూసుకో, నేను లేచి అప్పుడే అరగంటయింది. ఇక

మీరు బయలుదేరడమూ, బజార్లో వర్తకులు కొట్లు తెరవడమూ తరవాయి" అంటూ కనుబొమ్మలూ, తలా యెగరవేశాడు.

"ఫ్రూస్ యింతే కదా?" అంటూ స్మితపడి జోగమ్మ వాకట్లోకి వెళ్ళిపోయింది.

ఆమెని చూసి పూర్ణమ్మ లేచింది. వారి నిద్దర్నీ చూసి వెంకటచలం లేచాడు. వాకట్లో నీరి సందడి విని, గాది సావిట్లో జగ్గయ్య లేచాడు.

వీరి సందర్నీ చూసే సూర్యుడు పొడుపుకొండమీద తోచాడు.

"దొంగలు పడ్డ ఆరు మాసాలికి కుక్కలు మొరిగా" యన్నట్టు, ఆ తరవాత సావకాశంగా ఆరు కొట్టింది గడియారం.

చలపతి మనస్సు గుబగుబ లాడిపోయింది.

"వీళ్ళింకా యెప్పుడు బయలుదేరనూ?" అని చిరాకు పడుతూ మొదట రెండు మూడు నిమిషాలు వాకట్లో తచ్చాడా డతను; కాని అంతలో జ్ఞాపకం వచ్చి, పెళ్ళామో మామగారో "సంధ్యే" అనీ అనడంతోటే పిలిచేద్దామని, వచ్చీపోయీ జట్కాలలో కాళీవి చూడ్డా

నికి, తరవాత, అరుగుమీదకి వెళ్ళి బొత్తసకాళ్ళమీద కూచున్నాడు.

అత నలా కూచున్నాడు. అంతే. సరిగా అప్పుడే బుచ్చమ్మ యిల్లా వచ్చి గుమ్మంలో నుంచుంది.

దూరాన వొక కాళీ జట్కా కనపడింది. సమీపించింది. వచ్చేసింది. వెళ్ళే పోయింది. కాని అత నది గమనించలేదు. అతని చూపులు బుచ్చమ్మ మొగంమీదే వున్నాయి. అతని శ్రద్ధ అంతా ఆమె చూపులమీదేవుంది.

ఉండుండి "యిలా రా" అన్నట్టామె కళ్ళు చికిలించింది. మంత్రముగ్ధుడు లాగ అత నామె వెనకాలే దొడ్డిగుమ్మం దాకా వెళ్లాడు.

ఇలాగా అలాగా వొకమాటు కలయజూసి, బుచ్చమ్మ, రెండణాకాసులు యెత్తి పట్టుకుంది. వెంటనే అతని కుడిచెయ్యి ముందుకి సాగింది.

"ఈ రెండణాలూ పుచ్చుకో, కాఫీ హోటలుకి వెళ్ళి పెసరట్టూ వుప్మా తిని కాఫీ తాగు. మెల్లిగా ధవళేశ్వరం వెళ్ళి చక్కారా. రానూ పోనూ జట్కాకి రెండణాలు తగలెయ్యడం యెందుకూ, తిన్నది జీర్ణం కూడా అవుతుంది. దర్జాగా నడిచివెళ్ళి నడిచే వచ్చెయ్యి" అంటూ ఆ రెండణాలూ అతని చేతిలో విడిచిపెట్టిం దామె.

"బజారుకి వెళ్ళవద్దూ ?" అని బిక్కమొగం వేసుకున్నాడు చలపతి; కాని గుప్పిడి మాత్రం గట్టిగానే బిగించాడు.

"నువ్వెందుకూ ?" అని గదిమిందామె.

అతను జవాబు చెప్పలేకపోయాడు.

"నీపెళ్ళాం వెళుతోంది చాలదూ దొరసాని లాగా?"

"నేను కూడా వెడితే యేం ?"

"నిన్ను లోకువ చేసేస్తారు రా"

"ఎలా చేస్తారూ ?" అన్నట్టు చూశాడతను.

"సారె అన్నప్పుడు, వాళ్ళు, మన తాహతునీ, దర్జానీ పట్టి పట్టుకు రావాలి సరిగా తెస్తే మనం పుచ్చుకు వూరుకోవాలి, తక్కువ తెస్తే పేచీ పెట్టాలి. అంతే గాని, వాళ్ళు సామాను కొనేటప్పుడు నువ్వు దగ్గిర వుంటే, పేచీ పెట్టడానికి తరవాత నీకు హక్కేం వుంటుందీ ?"

ఈమహత పేచీ అతని బుర్ర కెక్కలేదు.

"కాకపోయినా నీపెళ్లానికి సామాను కొంటూ వుంటే వెనకాల నువ్వెందుకురా ?"

"డబ్బెక్కు వయినా అనీ నేనూ కొన మన్నవే కొంటున్నారే"

"కూతురు మాట వింటున్నారేమో గాని నీమాట వింటారా యేమిటి వెర్రిమొగమా ?"

"వింటూ వుంటేనే చే ?"

"అయితే సరే."

ఇలా అని చేతులు కలుపుకుంటూ నెక్క అమగు వెనక్కి వేసి తరవాత "నీకర్మం......నాకేం?" అంటూ మూతి బిడాయించుకొని గుర్రాలక్కలాగ మొగం తిప్పేసుకుం దామె.

దీంతో అతని కడుపులో రాయి పడింది.

వెడితే యేమిటో, వెళ్ళకపోతే యేమిటో ?

పదిరోజుల కిందట అయితే అతని కీ తటపటాయింపు లేకపోవును. ఇప్పుడు ద్వంద్వప్రభుత్వం వచ్చి పడింది.

బజారుకి వెళ్ళాలని అతని మనస్సెంతయినా పీకుతోంది. వెడితే తనూ పెళ్ళామూ యిద్దరుగ్గా వొక బండిలో కూచుని, నిన్నటిలాగే దర్జాగా బజారులో షికారు కొట్టవచ్చు. ఇవాళ మామగారు తాను కోరుకున్న కుర్చీ, దానికి తగ్గ మేజా, వాటికి పసందైన ఫాంటేకలమూ కొంటారు.

రాసుకునే టప్పుడు కాగితాల లెగిరిపోకుండా వుండేటట్టు రెండు పెద్ద గవ్వలు కొనమందామని కూడా

అతను నిశ్చయించుకుని వున్నాడు.

ఇక బజారుకి వెళ్ళకపోతే యెలాగా?

అంతా ముజ్జిడ్డుగా కనపడేం దతనికి.

"దీనిమీద ధవళేశ్వరం వెళ్ళకపోతే యేం?" అనుకున్నాడు; కాని ధైర్యం నిలిచేటట్టు కనపడలేదు.

ఒకరి కేసి వొకరు చూసుకున్నారు.

ఒక్క క్షణం అలా వుంచున్నారు వారు.

ఉత్తరక్షణంలో అతని దుర్బలహృదయంలో వొక్క మెరుపు మెరిచింది.

వెంటనే "అలాగే వెళ్ళివస్తా" నంటూ స్వయంగా తలుపు తెరుచుకుని అతను సందులో పడ్డాడు.

కాని, నాలు గడుగులు వేశాడో లేదో, బుచ్చమ్మ, చిటికెలు వేసి వెనక్కి రప్పించి "పది దాటాకా...... తెలిసిందా? ఈలోపుగా నువ్వు రావద్దు. ఊళ్ళోకి వచ్చినా యింటికి రావద్దు. మరి వెళ్ళు" అంటూ తల యెగరవేసుకుంటూ సెల విచ్చింది.

"సరే" అన్నట్టు తలమాత్రం వూపి కప్పుగంతులతో అతను సందు దాటేశాడు.

# ౧౭

ఎనిమిదిన్నర అయింది.

"ఈపాటికి దుకాణాలన్నీ తెరిచేస వుంటారు. తొరగా లేవం డమ్మాయీ" అంటూ జోగమ్మనీ, పూర్ణమ్మనీ తొందరపెట్టి "చలపతీ" అని పిలిచాడు వెంకటచలం.

దానికి జవా బయినా రాలేదు.

"ఎక్కడికి వెళ్ళారో సమయానికి?" అని చిరాకు పడుతూ, కాలు కాలిన పిల్లిలాగ జోగమ్మ యిల్లంతా వెదకడం మొదలు పెట్టింది.

పూర్ణమ్మ, వుండలేక "మీ తమ్ముడేడమ్మా?" అని ప్రాధేయ పూర్వకంగానే అడిగింది; కాని బుచ్చమ్మ "యేమో నేనే మెరుగుదుబా?" అని సాగదీసు కుంటూ నూతి దొడ్లోకి వెళ్ళిపోయింది.

వెంకటచలం పూర్ణమ్మకేసి చూశాడు. పూర్ణమ్మ జోగమ్మకేసి చూస్తూ "యెక్కడికో పంపేసింది" అంది. "అవును, ఆ పీనుగుపనే యిదీ" అంటూ జోగమ్మ పళ్ళు కొరుక్కుంది.

చివరికి వుసూరు మంటూ వారు ముగ్గురే బయలు దేరారు.

ఇదంతా ద్వార్లోనుంచి తొంగి చూస్తూనే వుంది బుచ్చమ్మ. వారు గుమ్మం దిగి నాలుగిళ్ళు దాటి వెంటా రన్నప్పుడు చరచరా మాడువా వాకట్లోకి వచ్చి వీధి గుమ్మంకేసి చూస్తూ "ఇహ గింజుకు చావండి. మహా బాగా చేశాను కాదూ" అంటూ విరగబడి రాకాసి నవ్వు నవ్వుకుంది.

బండి, కూరల బజారు దగ్గిరికి వెళ్ళింది. వెనకాల నడుస్తూ వెంకటచలం జోగమ్మతో ఏమిటో నచ్చచెబు తున్నాడు. పూర్ణమ్మ కూడా ఆపనే చేస్తోంది. అయినా జోగమ్మ మాత్రం మొగం వేలవేసుకునే వుంది.

ఎక్కణ్ణుంచి వచ్చాడో, యిలాంటప్పుడు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ చలపతి చక్కావచ్చాడు; కాని "యెక్కడికి వెళ్ళావోయ్?" అని వెంకటచలం కొంచెం చురుగ్గా అడిగే దాకా జోగమ్మా పూర్ణమ్మా కూడా అతన్ని చూడలేదు.

చురచుర చూస్తూ "యెక్కడికి వెళ్ళా రండీ?" అంది జోగమ్మ. అప్పుడయినా వచ్చినందుకు సంబరం కాక, మొదట కనబడకపోయినందుకు ఆమాటలో వుక్రోషం యెక్కువగా వుండింది.

"ఎక్కడి కయినా నువ్వే వెళ్ళావా, నిన్నెవ రయినా

పంపారా చలపతీ?" అని మెల్లిగా అడిగింది పూర్ణమ్మ. "మాట్లాడ రేమండీ?" అని జోగమ్మ కొంచెం కరుగ్గానే అంది; కాని అత నెవరికీ జవాబు చెప్పలేదు. ముసిముసి నవ్వులికి వొక అంశ మాత్రం యెక్కువ చేశాడు.

"ఏమయితే యేం వూరుకోం డింక. ఎక్కడికి వెళ్లినా సమయానికి వచ్చాడు కదా ?" అని జోగమ్మనీ పూర్ణమ్మనీ సముదాయించి, వెంకటచలం "చెప్పి వెడితే నన్ను కూడా తీసుకు వెళ్ళవలసివస్తుం దని రహస్యంగా వెళ్ళి వచ్చావు కాఫీహోటలుకి, అవునా ?" అని కొంటె చూపులు చూస్తూ చలపతిని ముదలకించాడు.

సిగ్గుపడి చలపతి మొగం పక్కకి తిప్పుకున్నాడు.

దీనిమీద కాఫీ నోరూరించగా "నిన్న మరచి పోయాను. ఇవాళ నాకు కాఫీఫిల్టరు కొని యివ్వకపోతే వొప్పుకోను నాన్నారోయ్" అంటూ జోగమ్మ గునిసింది.

"అవునేవ్ ! నేన్నూ మరిచిపోయాను చూశావా ? ఇవాళ తప్పకుండా కొంటాను. ఇద్దెనపాత్రా, యించక్క ముద్దొస్తూ వుంటాయి రెండు మూడు జతల పింగాణీ కప్పులూ కూడా కొంటాను సరా ?" అని కూతురికి పూర్ణమ్మ వాగ్దానం చేసింది.

"అయితే, వెండి కప్పులూ సాసర్లూ, యెందుకమ్మా

మరి ? కాఫీ సోసీ పొయ్యడంతోటే అవి వేసెక్కి పోతాయి. కాఫీ వేడికి నాలుకా, కప్పు వేడికి పెదవులూ చురుక్కుమని పోతాయి, యేమి సుఖమూ ? కనక మధ్యాహ్నం తీసుకువెళ్ళి మళ్ళీ అవి సావుకారుకే యిచ్చేద్దాం బతిమాలి. తరవాత మరో రెండు జతలు పింగాణీవే కొనిపెడుతుంది మీఅమ్మ నీకు దర్జాగాను" అన్నాడు వెంకటచలం చిరునవ్వు ఆపుకుంటూ.

"చూశావుటే అమ్మా నాన్నార్ని ?" అని జోగమ్మ గారాం కుడవగా కళ్లు చికిలించుకుంటూ పూర్ణమ్మ వెంకటచలంకేసి చూసింది.

ఈ సంభాషణ తన హృదయవీణకు శ్రుతి కలపగా "బాబయ్యగారు వూరికే అంటూ రం డమ్మాయిగారూ ? కూతుళ్ళ కిచ్చిన వస్తువులు తల్లిదండ్రులు మళ్ళీ పుచ్చుకోడం యెక్కడయినా వుందాండి భూమ్మీదా ?" అని బండివా డంటుకున్నాడు.

"మరే మా అమ్మ మరీని విన్నావా ? మాట్లాడవేం ? వద్దని నాన్నారితో చెప్పవేం ?" అంటూ తల్లి తొడమీద పొడిచింది జోగమ్మ.

దానిమీద వెంకటచలం "మీ మాటలు విని అల్లుడు నవ్వుకుంటున్నాడు చూశావా ?" అనగా, పూర్ణమ్మ

"తప్పేం? నాయనా, నీనవ్వే మాకు పదికోట్లు, రా కూచో" అంటూ ముందుకి జరిగింది.

కళ్ళతో పిలుస్తూ జోగమ్మకూడా జరిగింది; కాని మామగారు నవుస్తూ వుండగా తాను బండెక్కడమా, మానడమా అని చలపతి మనస్సు యిలా చర్చల్లో పడగా, అతని శరీరం మాత్రం యెగిరి అలా బండిలో పడింది.

## ౧౫

సామానంతా కొనేటప్పటికి పదకొండయింది.

అనుకోంది ఫిల్టరూ, కాఫీపొడుం సీసా, పంచదార సీసా, కప్పులూ, సాసర్లూ, స్పూనులూ వుంచుకోడానికి కోటే వొక చిన్న బీరువాకూడా కొనిపించుకుంది జోగమ్మ.

పూర్ణమ్మా, జోగమ్మా, చలపతీ వొక బండిలో కూచోగా, చిల్లర సామానంతా వేయించుకుని వెంకటచలం మరోబండిలో కూచున్నాడు.

వెనకాల, ముగ్గురు ఆడకూలీలు చేనచెక్కల బట్టల బీరువా తెస్తున్నారు. ఒక కూలీ మార్బిలుమేజా, మరొక కూలీ టేకు మేజా, తిరుగుడు కుర్చీ తెస్తున్నారు.

"నువ్విచ్చిన కాఫీగింజలు వీసెడూ మాయిద్దరికీ రెండు నెలలు సరిపోతాయే అమ్మా" అంటూ ప్రారంభించింది జోగమ్మ.

"అదేమిటే, నీమామగారి కివ్వవుటే పాపం ?" అని జాలి వెలకబోసింది పూర్ణమ్మ.

"ఏమండీ, మీనాన్నగారు కాఫీ పుచ్చుకోడం వుంది టండీ ?"

"ఎప్పుడేనా వుంది. నిషేధం లేదు"

"అయితే. నెల్లాళ్ళు వస్తాయే".

"మరి తరవాత ?" అందా మనుకున్నాడు చలపతి. మాట నాలుక చివరికే వచ్చేసింది; కాని పెదవులు అడ్డేశాయి.

"సన్నడగం యెందుకే ? కాకపోయినా మీసంగతి నాకేం తెలుస్తుందే ? రెండు మాసాల్లో కాదు, నెలా పదిహేను రోజుల్లో కాదు, వెుక్క వారం రోజుల్లో కానిచ్చేసుకోండి మాకేం ? వెుట్టి ఫిల్టర్లూ, అవీ యివ్వ కూడదని వీసెడు కాఫీగింజలూ, వీసెడు చక్కెరా యిచ్చాం. వాటికోసం రెండు రూపాయలు పైె దాటింది మాటలా ?" అని కళ్ళు తిప్పుకుంటూ ముదలకించింది పూర్ణమ్మ.

"పోనీ ఆపీసెడు గింజలికీ పీసెడు చక్కేరా సరిపోతుం దేమో నువ్వే చెప్పు మరీ"

"అవి అయిపోతే మీా వంటింటో పొయిమీాద రెండు బెల్లబ్బుట్ట లుంకనే వున్నాయి"

అత్తగారిలా అనగా చలపతి వులిక్కిపడ్డాడు. జోగమ్మ కూడా మొదట మాట్లాడలేకపోయింది; కాని వెంటనే నిదానించుకుని "అవిక్కూడా అయిపోయాకా?" అంది.

"ఏమో? నాకు తెలవదు. నన్నడక్కు" అంటూ బుంగమూతి పెట్టుకుని మొగం పక్కకి తిప్పుకుంది పూర్ణమ్మ.

"కానిపెట్టకపోతే పోయింది సలహో అయినా చెప్ప డాని కేమే మాామ్మా?" అంటూ జోగమ్మ తల అడ్డంగా ఆడించుకుంది.

పూర్ణమ్మ మాట్లాడలేదు. మొగంకూడా యిలా తిప్పుకోలేదు.

జోగమ్మ వొక్కమాటు నిదానించి చూసింది. చలపతి కేసి చూస్తూ చిన్న మందహాసం కూడా చేసింది. చివరికి "పోనీ, తెల్లగానే వుంటుంది కనక, తొమ్మిది కానులు పెడితే రెండు శేర్లు కూడా వస్తుంది కనక, మెత్తగా

కొట్టుకుని వుప్పు వేసుకుంటామే. ఏమే అమ్మా ?" అని కొంటె చూపులు చూస్తూ అడిగింది.

ముగ్గురూ ఫకాలు మనిపోయారు.

అప్పటికి బళ్ళు వైగ్రాం రోడ్డు మొగలోకి వచ్చాయి. బండివాడు "తప్పుకో తప్పుకో" మంటూ వొక కావటి వాణ్ణిఅదలిస్తున్నాడు. "ఆ సవ్వెందుకు చెప్మా ?" అంటూ వెంకటచలం తొంగి చూస్తున్నాడు.

ఈసమయంలో, జోగమ్మ తెల్లబోయి "అదేమండీ ? దిగిపోతా రేమండీ ?" అని ఆత్రంగా అడుగుతూనే వుండగా, జవాబు చెప్పకుండా గభీ మని కిందికి వురికి, నాళంవారి సత్రం కేసి లగువులు వేశాడు చలపతి.

## ౧౬

వివరాలు చెబుతూ వెంకటచలం సామా నంతా చూపించగా జగ్గయ్య పరమానందభరితు డయిపోయాడు.

తరవాత, జోగమ్మ, వొక్కొక్కటే కాఫీపరికరాలు తెచ్చి యెదట వుంచి, వాటికోసం కొన్న బీరువా కూడా చేతి కందేట ట్టొక పక్కగా నిలవబెట్టి ఫిల్టరు విడతీసి చూపిస్తూ బోధించి "మన యింటో పగలు పదకొండు

గంటలకే భోజనా లయిపోతాయి కనక మళ్ళీ రాత్రి యేడున్నర దాకా వుండడం కష్టం. రోజూ మూడు గంటలికి నేను కాఫీ చేస్తూ వుంటాను, మీరు కూడా పుచ్చుకోవాలి సుమండీ. మీరు కనక పుచ్చుకోకపోతే మేమూ మానేస్తాం యే మనుకున్నారోను" అని తండ్రితో లాగ చాలా చనువుగా చెప్పింది

దీనికి మరీ పొంగిపోయాడు జగ్గయ్య.

"అలాగే పుచ్చుకుంటాను, తల్లీ. మీ కేమీ మానుకో నక్కర్లేదు. నీచేత్తో మంచినీ ళ్ళిస్తే అవే కాఫీ అని సంతోషిస్తాను నేను, మరి కాఫీ యిస్తే యిక వేరే చెప్పాలా? కాఫీ పుచ్చుకోక మన కేమన్నా? మా నాన్నగారు కావలసినంత ఆస్తి సంపాదించి యిచ్చారు నాకు. నేను సంపాధించలేకపోయాను; కాని పాడు చెయ్యకుండా అది మీ చేతిలో పెడుతున్నాను. నా అదృష్టం కొద్దీ నువ్వు దొరికావు మాకు. మీనాన్నగారొకటీ నే నొకటీ కాదు సుమా తల్లీ, నీకు" అంటూ ఆ సామా నొక్కొక్కటే పుచ్చుకుని చూసి, మెల్లిగా కింద వుంచి "దాచుకోమ్మా" అన్నా డతను.

అది విని కూతురి తెలివితేటలికీ, జగ్గయ్య వాత్సల్యా

నికీ పూర్ణమ్మా వెంకటచలమూ చాలా సంతో షించారు.

ఏమీ యెరగనట్టు మెల్లిగా యీ సమయంలో వచ్చాడు చలపతి.

"ఏం నాయనా, బజారుకి వెళ్ళలేదూ నువ్వూ?" అని ఆత్రంగా అడిగాడు జగ్గయ్య.

"ధవళేశ్వరం వెళ్ళాను నాన్నా" అన్నాడు చలపతి.

జోగమ్మా, పూర్ణమ్మా, వెంకటచలమూ వులిక్కి-పడ్డారు.

"ఎవరు పంపారూ ?"

"అక్కయ్య"

జోగమ్మా, పూర్ణమ్మా, వెంకటచలమూ "మనం అనుకున్నదే కాదూ ?" అన్నట్టు మళ్ళీ చూసుకున్నారు.

"ఎందుకూ ?" అని కొంచెంకరుగ్గా అడిగాడు జగ్గయ్య.

ఏం చెప్పాలో తోచక చలపతి దిక్కులు చూస్తూ వుండగా గభీమని వెంకటచలం అందుకుని "సంసారి అయినవాడికి అనేకపను లుంటాయి, పని పట్టి ఆరా తీసీకేమిటి భావగారూ ?" అని సద్ది చెప్పాడు.

"నే నింటో వున్నానుకదా, వెళ్ళేటప్పుడు నాతో

కాస్త చెప్పగూడదూ?" అని కొంచెం రోషంతో అడిగాడు జగ్గయ్య.

అందుకు గూడా జవాబు చెప్పలేక చలపతి మళ్ళీ తన కేసి చూడగా "బుచ్చమ్మ అన్నా, మీరన్నా అతనికి సమానమే కాదుటండీ?" అన్నాడు వెంకటచలం.

పడమటింటో తలుపు చాటున నక్కి వున్న బుచ్చమ్మ యిదంతా విని, కొట్టినంత బాధపడి వంటింటి పెరట్లోకి వెళ్ళి కూలబడింది.

జగ్గయ్య తల యెత్తుకోలేకపోయాడు.

## ౨౦

"మీ అమ్మా, మీనాన్నా వెళ్ళారా యింకా వున్నారా చెల్లాయీ?"

నూతిపళ్ళెంలో వెండికంచం కడుగుతూ వుండగా, జోగమ్మ కీమాట వినబడింది; కాని యెటు చూసినా యెవరూ కనపడలేదు.

"ఇక్కడున్నాను నేను" అని మళ్ళీ వినపడింది.

ఎడమవేపున వున్న డాబా కేసి చూసింది; కాని జోగమ్మకి అక్కడా యెవరూ కనపడలేదు.

"ఇక్కడేవమ్మా వెరితల్లీ"

వెనక్కి తిరిగి చూడగా, గోడ అవతల, కరివేప చెట్టు కొమ్మల్లో నక్కి వుండి మాట్లాడుతోంది సోడెమ్మ. ఆమెని చూడగానే జోగమ్మ మొగం యింతయింది.

"ఇంకా వెళ్ళలే దండీ. బజారునుంచి వచ్చాము, యిప్పుడే భోజనాలు చేశాము"

"ఇవ్వ దలుచుకున్న సామా నంతా కొనడం అయిందా ?"

"అయిందండీ ! వచ్చి చూడరూ అక్కయ్యగారూ ?"

"ఇంతకంటేనా అమ్మా ? కాని నువ్వు రమ్మన్నప్పుడు వచ్చి చూస్తాను"

"ఇప్పుడు రమ్మనడం లేదూ ?"

"ఇలా కాదు చెల్లీ"

"మరెలా గండీ ?"

సోడెమ్మ చెప్పలేదు ; కాని జోగమ్మకి అంతా బోధ పడి పోయింది.

"ఇలా కాదంటే, యీ జన్మలో నాకంత అదృష్టం పడుతుందా అక్కయ్యగారూ ?"

"అదేవమ్మా, అలా బేలపోతావ్ ? ఇదంతా నీదే

కాదూ ? తక్కినవాళ్ళు గుప్పెడు మెతుకుల కోసం చేరిన యీగలే కాదూ ?"

"నే నే యిప్పు డలా వున్నా నండీ"

"తప్పు తప్పు అలా అనుకోకమ్మా ! నిన్ను చూస్తే నా కేడుపు వస్తోంది. దిక్కుమాలిన పీనుగు చూస్తే పీకే స్తుంది, మరోకప్పుడు మాట్లాడుకుందాం వెళ్ళమ్మా"

బుచ్చమ్మ వస్తోందేమో అని వైకమా టలాగా యిలాగా చూసి "వుపాయం చెప్పరూ ?" అంటూ జోగమ్మ మళ్ళీ కరివేపచెట్టుకేసి చూసింది; కాని సోదెమ్మ లేదు. చెట్టు కొమ్మలు మాత్రం వూగిపోతున్నాయి.

అంతట యేదో దిగులు పట్టుకున్నట్టయిపోయి జోగమ్మ వూర్ధ్వశ్వాసతో యింటోకి దూకింది.

## ౨౧

"ఇంకో రెండేళ్ళు పోతే నీరుయింటిపే రయినా పైకి రాని వ్వదు. పెళ్ళయి ఆరుమాసా లయినా తిరక్కుండా యిల్లు పట్టింది, నడివీధిలో నుంచుని తన యిల్లని చెబుతోంది భామ"

"ఎలాగే అమ్మా మరీ ? ఇందుకే కామోసునే నిన్న సోదెమ్మక్కయ్యగా రలా అన్నారూ"

"ఆవిడ అందంటే అనదూ? దీని గుణాలు మొక ణ్ణుంచీ యెరగనివా, మన కంటే కొత్త కానీ? ఇంతకీ: నీ మామగా రేమనుకుంటారో అని చూస్తున్నాను. లేక పోతే నెక్క- క్షణంలో దిగ్గుంజెయ్యనూ రాకాసినీ?"

ఈమాట అంటూ వుండగా వెంకటచలం వచ్చి "యేమి" టన్నాడు, "ఎవరో ముసిలి బ్రాహ్మ డడగ్గా బుచ్చమ్మ ఈయిల్లు తన దని తేల్చింది. "కందుకూరివారి దనకపోవడం యేమిా?" అని అమ్మాయికి కష్టంగా వుంది" అని పూర్ణమ్మ చెప్పింది.

"ఆమాట నేనూ విన్నాను. కాని మన బంగారం మంచిది కాదు" అన్నాడు వెంకటచలం.

"అతనికి చేత కాకపోతే అమ్మాయి చేసుకుంటుంది పెత్తనం, మధ్య యిదెవరండీ?"

"కొంచెం వోపిక పట్టాలి. కోడళ్ళు కాక, ఆడబడు చులే పెత్తనం సాగించే యిళ్ళు లోకంలో యెక్కువే వున్నాయి. పీలు కానప్పుడు పడి వుండాలి."

"ఎన్నాళ్ళూ?"

"వో—హాో—హాో— చలపతికి జ్ఞానం వచ్చేదాకానూ. చెప్పడం యెందుకూ?"

"సముద్రంలో కెరటాలు తగ్గడమూ, చలపతికి——"

"అంత నిరాశ అక్కర్లేదు"

"ఇక నేను లే ననుకోండి నాన్నారూ"

ఇలా అంటూ జోగమ్మ తల్లిమీద వాలింది. అది చూశాటప్పటికి వెంకటచలం కళ్ళు చెమ్మగిల్లాయి. పూర్ణమ్మ కూడా అలాగే అయి, అయినా ఆమెని పొదివి పట్టుకుని "నీకేం తల్లీ? ఆమనోవర్తి మనిషి నిన్నేం చెయ్యగలదమ్మా?" అని ఓదార్చి "ఇంకో పదిహేను రోజులు సెలవు కోరండీ. ఆరెండు వారాలూ కూడా చూసి, వీలు లేకపోతే అప్పుడు అమ్మాయినీ అల్లుణ్ణీ మన యింటికే తీసుకు వెడదాము" అని సలహా చెప్పింది.

"అది రానిస్తుందిటే అమ్మా?"

"అవునేవ్, మీ రేమంటారండీ?"

"రానిస్తుందే అనుకో. చలపతి మన యింటో వుంటే యిక్కడ యేది యేమయిపోతుందో ఆలోచించావా?"

"అదీ నిజమే. గండకత్తెర వచ్చి పడిందండీ యీ భూతంతోటీ"

"సరే, ముందు సెలవు హెచ్చు చేయించుకువస్తాను, తరవాత అట్నుంచి నరుకు-వద్దాం"

ఇలా చెప్పి వెంకటచలం సూపర్నెంటు ఆఫీసుకి వెళ్ళాడు.

## ౨౨

"ముందుముం దింతకంటే సయ్యోధ్యలుండి యేడుస్తాయా యేమిటి, యేమయినా సరే పూమాటు సోదెమ్మగారి యింటికి వెళ్ళి వస్తానే"

జోగమ్మ నిలువుటద్దం యెదట నుంచుని వుండగా ఆమె తలలో, బర్మాముడి చుట్టూ, గులాబీపువ్వులు సర్దుతూ యిలా అంది పూర్ణమ్మ.

" నేనూ రానా ?" అంటూ వుబలాటపడింది జోగమ్మ.

"కళ్ళల్లో నిప్పులు పోసుకోదూ ?"

"ఎ—లాగే మరీ—?

ఇలా గునుస్తూ యెదటికి తిరిగి, తల్లి జబ్బలు పట్టుకుని వేళ్ళాడింది జోగమ్మ.

"ముందు నన్ను వెళ్ళి రానియ్యమ్మా"

"పోనీ, రేపు తీసుకువెడతావా నన్ను ?"

ఈ సమయంలో జగ్గయ్య గుమ్మంలోకి వచ్చి "అమ్మాయీ, వంటిల్లుసవరించాలిట. కాస్తచూడమ్మా" అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఉత్కటానందంతో మెరుపు కొట్టినట్టయి, తల్లీ

కూతురూ వొక్క క్షణం మాట్లాడలేకపోయారు. కదలా లేకపోయారు.

తరవాత జోగిమ్మ "బతికాం" అనగా "నువ్వు కూచో అమ్మా నేను సవరించి వస్తా" నంటూ పూర్ణమ్మ బయలుదేరింది.

జోగమ్మ మళ్ళీ నిలువుటద్దం కేసి తిరిగింది.

రేగిన కనుబొమ్మలు సాఫుచేసుకుని, లోలకుల సీమ కమలాల జిగజిగలతో మెరుస్తూ వున్న చుంబుగ్గ వొక మాటూ ఆబుగ్గ వొకమాటూ చూసుకునేటప్పటికి ఆమె కేదో వూహ తట్టింది.

వెంటనే చిటికెలు వేసుకుంటూ ముందు పడమటింటోకి, అక్కణ్ణుంచి పెరట్లోకీ వురికి, సరిహద్దు గోడ దగ్గిరగా నుంచుని, కంఠం నొక్కుకుంటూ "అక్కయ్యగారూ" అని పిలిచింది.

జవాబు రాలేదు.

అవతల బిందెలో చెంబు ముంచిన చప్పుడు.

"ఆభూతానికి వినపడుతుం దేమోనే" అంది పూర్ణమ్మ.

"ఎక్కడో ఫర్లాంగు దూరాన పీధిగదిలో వుంది విన పడదే..........అక్కయ్యగారూ"

ఇప్పుడూ జవాబు లేదు.

"పని పూర్తి చేసుకుని వాకట్లోకి వెళ్ళిపోయా రేమోనే అమ్మాయీ"

"వెళ్ళిపోలేదమ్మా, యింకా వాటింటోనే వున్నారు. సోదెమ్మక్కయ్యగారూ"

"చెల్లీ"

"ఆ"

"పిలిచావా అమ్మా!"

"అవునండీ. ఏం చేస్తున్నారూ ?"

"పని అయిపోయింది. ఇక వాకట్లోకి వెళ్ళిపోదా మనుకుంటూ వుండగా పిలిచావు నువ్వు"

"నాకు మూణ్ణాళ్ళ పండుగు వచ్చిందండీ"

ఈమాట అన్నప్పుడు జోగమ్మ మనస్సు వురకలు వేసింది. కంఠం గద్గదిక మయింది.

"నిజంగా ?"

"నిజంగానే నండీ"

"వచ్చిందా తల్లీ? మహా బాగా జరిగింది. వెయ్యి మంది దేవుళ్ళకి మొక్కుకుంటున్నాను నేను, మీ అమ్మా నాన్నా వుండగా యిలా జరగాలనీ. మీ అమ్మ యేం చేస్తున్నారూ ?"

"ఇక్కడే వుందండీ. ఏమయినా సరే అని మాఅమ్మ

మీయింటికి రావా లనుకుంటూ వుండగా మామగారు వచ్చి వంటిల్లు సవరించాలని చెప్పారు"

"వెర్రి బ్రాహ్మడు, ఏమీ యెరగడు పాపం. సత్య రుషీ. అంచేతే ఆడుతోంది ఆట .....పిన్నిగారూ"

"వింటున్నా" నంది పూర్ణమ్మ.

"నూతి పెరట్లోకి రండి"

"వస్తున్నా......నువ్వు సద్దుకోవే తల్లీ వంటిల్లు"

ఇలా అంటూ యెక్కడి పని అక్కడ విడిచిపెట్టేసి పూర్ణమ్మ వెళ్ళిపోగా "ఇంటో వుండకుండా యెక్కడికి పంపిందో? ఈ మూడు రోజులూ కంటపడనివ్వను" అనుకుంటూ జోగమ్మ పని అందుకునేటప్పటికి "యెక్కడికిరా యిట్టట్టే వెడుతూ వుంటావూ? ఈపాటికి కుదురు నేర్చుకో నాయనా" అని వాకట్లోనుంచి జగ్గయ్య మాట వినవచ్చింది.

## ౨౩

జోగమ్మ, గదిలో కూచుని ఫలహారం చేయిస్తూ, తాను కూడా చేస్తూ చలపతికి జ్ఞానస్నానం దయచేయిస్తూ వుండగా, వంటింటి వసారాలో జగ్గయ్యకీ, వెంకటచలానికీ పూర్ణమ్మ ఫలహారాలు వడ్డించింది.

అది చూశాటప్పటికి ప్రాణాలు లేచిరాగా "ఇదేమి టండోయి భావగారూ, మీకు మేము చెయ్యవలసిన మర్యాదలు మాయింటో మీరే మాకు మొదలుపెట్టా రేమిటండీ?" అని అడుగుతూనే జగ్గయ్య వొక పళ్ళెం దగ్గిర మెల్లిగా కూచున్నాడు.

"మాయింటోనూ, మీయింటోనూ కూడా మీకు మేమే చెయ్యాలి. ఆడపిల్లని కనుకున్నవాళ్ళం కాదుటండీ మేమూ? మాసంగతి అంతా మీదయాదాక్షిణ్యాల మీద నిలిచివుంది కాదుటండీ?"

"అదేమిటి చాలా కొత్తమాట సెల విస్తున్నారు, మీ అనుగ్రహమే మాకు కావాలి. చలపతి భారం అంతా మీమీదే వుంది తెలుసా?

"మీరు చల్లగానే వుండగా అది మాదాకా రావడం ధర్మమా? మీ రిలా సెల విప్పించవచ్చా?"

"నాతత్వాన్ని పట్టి ధర్మమే. ఏమంటే? నాకు వ్యవ హారం యేమీ తెలవదు. మీవియ్యపురా లయినా నా లాగే శుద్ధ అమాయికురాలు. మాయిద్దరిలోనూ యెవ రికి వ్యవహారజ్ఞానం వుండినా మా ఆస్తి యింతకి రెట్టిం పయి వుండకపోవునా? మీరు బాగా చదువుకున్నవారు.

అన్నీ తెలిసినవారు. అంతా చేతనయినవారు. బాధ్యత కూడా వున్నవారు. అంచేతే నే నిలా అంటున్నాను"

"చలపతి మీకు కుమారుడూ, మాకు అల్లుడూనూ, మాకు మాచిట్టితల్లి తప్ప మరెవరూ లేరు కదా? ఆ వుభయుల శ్రేయస్సూ కాక కోరతగింది మాకు మరేం వుందీ?"

ఈమాటమీద పూర్ణమ్మ అందుకుని "ఈకాలపు మొగపిల్లలికి కోకళ్ళు చెప్పవలసిన పనే లేదు. అయినా యేమీ దిగడిపోకుండా అన్ని విధాలా బుచ్చమ్మ దిద్దతూనే వుంది చలపతిని" అని సన్నాయి నొక్కులు నొక్కి మొగుడికి కన్నుగీటింది.

"అవునవును" అన్నాడు వెంకటచలం.

జగ్గయ్య వులిక్కిపడ్డాడు.

జోగమ్మ వచ్చినప్పణ్ణుంచీ బుచ్చమ్మ వాలకం అంతా కాకపోతే కొంతయినా తెలుస్తూనే వుంది; కాని కజ్జా అంటే వెనక్కి తీసే వెంకటచలం యిలా అనడంవల్ల అది దుర్భర మయి వుంటుం దని తోచిం దతనికి. దాంతో పాపం మొగం చిన్నపుచ్చుకున్నాడు.

ఇది గ్రహించి వెంకటచలం ప్రసంగం మార్చ బోయాడు; కాని పూర్ణమ్మ సాగనివ్వలేదు.

"ఇంతకీ: పాపం బుచ్చమ్మకి మాత్రం యింకేవరున్నారూ? చలపతి బాగుపడ్డం కంటే అమెకి మరో కోరిక యేమి వుంటుందీ? మా అమ్మకి అత్తగారైనా, ఆడబడు చయినా, తల్లి అయినా, అక్కయినా సర్వమూ—"

కాఫీ గళా సంకుకుని వొక్క గుక్క పీలుస్తూవున్న జగ్గయ్య పూర్ణమ్మమాట కడ్డంవచ్చి "పూర్ణమ్మగారూ, మీారనవలసిన మాటే అన్నారు మీారు; కాని చల్లకివచ్చి ముంతదాచడం నావల్లకాదు. భావగారూ, మీారుకూడా వినండి. ఇక్కడి గొడవలన్నీ నాకూ తెలుసు మీాకూ తెలుసు. మాటమీాద మాట వస్తూనే వుంటుంది; కనక వాగ్వాదం వద్దు. నామాట విని వెంటనే మీా రీవూరు బదిలీ చేయించుకోండి" అన్నాడు.

వెంకటచలం కళ్ళల్లో "యిదంతా నీమాట మహిమ" అన్న భావం మెరవగా, పూర్ణమ్మ కళ్ళల్లో "చెప్పుకోండి" అన్నట్టు ఆత్రం తొణికిస లాడిపోయింది

"మీారు వినోదం కోసం యిలా అనడం లేదు; కాని యీాసంగతి మీా అమ్మాయితో ఆలోచించారా?"

"అవసరంలేదు. మీారు నేను చెప్పినట్టు చేస్తే మీా

అమ్మాయిని కనిపెట్టుకుని వున్నవారూ అవుతారు చల పతిని బాగుచేసినవారూ అవుతారు"

"చిక్కు లేమయినా రావచ్చునేమో ?"

"మనం ద్వాంద్వాతీతులం కాము. నాకు కావలసింది నాకొడుకు బాగుపడడమూ, నా వంశం వృద్ధి కావడమూ— ఇంతే. కనక మీరు తప్పకుండా బదిలీ చేయించుకోండి"

"మీ సెలవు"

"నా సెలవో మీ విధో నేను చెప్పనక్కర్లేదు"

"అయితే, తప్పకుండా బదిలీ చేయించుకుంటాను"

"చాలా సంతోషం. మీ దయవల్ల నా కిప్పటి కొక బెంగ తీరిపోయింది"

తరవాత, జగ్గయ్య పూర్ణమ్మకి కూడా కొన్ని సంగతులు చెప్పి వాకట్లోకి బయలుదేరాడు.

కూతురు సిద్ధంచేసి వుంచిన తాంబూలం వియ్యంకుడి కిచ్చి తానున్నా వేసుకుని "ఇంకా అడుగుతున్నారా మెల్లిగారూ ?" అని పూర్ణమ్మచేత మళ్ళీ అనిపించుకుని, వెంకటచలం, వుపాయం ఆలోచించుకుంటూ సూపర్నెంటు ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

తరవాత పూర్ణమ్మ "ఇప్పటి కొక్క బెంగ తీరిందా ?

ఇంకా ఆవున్న బెంగలేమిటి చెప్మా?'' అని ఆలోచిస్తూ స్థలశుద్ధి చేసేసి యీ సంగతి జోగమ్మతో చెబుదా మని తూనీగలాగ బయలుదేరింది.

అప్పటి కప్పుడే తాంబూలాలు కూడా ముగించుకుని, గోడలమీాద వున్న పటాలు అక్కడి విక్కడా, యిక్కడి వక్కడా మార్చడంలో "అలా కాదు'' అని వొకరూ "అలాగా కాదూ'' అని మరొకరూ కిందా మీాదా పడి పోతున్నారు జోగమ్మా, చలపతీనీ.

## ౨౮

ఆవేళా, మన్నాడూ, ఆమన్నాడూ కూడా జోగమ్మా, చలపతీ వీధిగుమ్మం తొక్కి చూడలేదు.

పూర్ణమ్మ సెలవు చెప్పిన వొకటి రెండు మాట్లు బజారుకి వెళ్ళవలసివచ్చింది; కాని బుచ్చమ్మ వీధి గదిలో వుంటే దొడ్డిదారినీ, దొడ్డి వేపున వుంటే సింహద్వారాన్నీ పంపుతూ మళ్ళీ అలాగే రప్పిస్తూ వచ్చింది చలపతిని జోగమ్మ.

బుచ్చమ్మ చలపతిని పిలవా లన్న సంకల్పం మొదటి నాడు బలవంతాన అణిచేసుకుంది. రెండోనాడు కూడా

చాలావరకు గుట్టుగానే పడి వుంది; కాని మధ్యాహ్నం, యేదో పనిమీద పూర్ణమ్మ వీధిగుమ్మంలోకి రాగా, యిక పట్టలేక "మాతమ్మ యేం చేస్తున్నా డండీ అత్త గారూ?" అని మృదువుగా—వినయంగా—మర్యాదగా—బెల్లిస్తూ కూడా అడిగింది.

కాని, పూర్ణమ్మ, వెనకటి కథ జ్ఞాపకం చేసుకుని "ఏమో నే నేమెరుగుదునూ?" అని తిరగవేసి, కొట్టి వచ్చిన పని కూడా విడిచిపెట్టేసి, గిరుక్కున మళ్ళీ యింటోకి వెళ్ళిపోయింది.

బజారుకి వెడుతూ జగ్గయ్య కూడా నిర్లక్ష్యంగానే జవాబు చెప్పాడు.

దీంతో బుచ్చమ్మ మొగం గూక్కుపోయింది.

"ఈమూడు రోజులూ వీళ్ళు భాగోతం ఆడేస్తారు" అంటూ వ్రేళ్ళు రవలబెట్టుకుంది. అయినా ఆమె వూరుకో తలుచుకోలేదు.

"ఇప్పుడు మూ డయి వుంటుంది కదా?" అనుకుంది. "కనక యిది ఫలహారసమయం" అని వూహించింది. "తప్పకుండా పడకగదిలోనే వున్నాడు చలపతి" అని ధ్రువపరుచుకుంది. "పలికేదాకా వూదరకొడితే కళ్ళు బడకుండా వుండగలడా?" అని ఆలోచించింది. "ఇవాళ

అటో యిటో తేలిపోవాలి” అని నిరుకు చేసుకుంది. చప్పుడు కాకుండా తలుపులు తెరుచుకుని అరుగు మీాదకి వచ్చి, మెల్లిగా వీథిలోకి దిగజారి, యెవ రేనా చూస్తున్నా రేమో అని వో కమాటు అలాగా యిలాగా చూసి, యేడెనిమిది మాసాలనుంచి పడి వున్న గుట్టలోనుంచి పట్టెడు కంకరరాయి సంగ్రహించి, వెంటనే దక్షిణపు అరుగెక్కి- టక్కు టక్కున కిటికీ తలుపు కొడుతూ “చల పతీ, వురేయ్, తమ్ముడూ” అంటూ పిలుపుమీాద పిలుపు మొదలుపెట్టింది.

కాని, గదిలో అప్పటికి ఫలహారం పూర్తి అయిపోయి తాంబూలచర్వణం జరుగుతోంది.

చలపతి “సొంత” కుర్చీలో కూచుని వున్నాడు.

ఎదట నుంచుని, చేతులు కుర్చీచేతులమీాద వుంచు కుని, అతనిమీాదకి వాలి, మొగంమీాద మొగం పెట్టి జోగమ్మ కువకువ లాడుతోంది.

ఎడమ చెయ్యి ఆమె మెడకి చుట్టవేసి, చలపతి తెరిపి మరుపుల్లో వున్నాడు.

అర్ధరాత్రి వేళ, యెలాంటి అలజడీ లేక యివతల గాఢనిద్రలో వుండగా, దొంగపోటుగా వచ్చి అవతల కోటమీాద ఫిరంగులు మోగ్గాయించిన ట్టయింది.

దంపతు లిద్దరూ వులిక్కి పడ్డారు.

కంగారుపడుతూ చలపతి వెంటనే లేవబోయాడు; కాని అది చూసి ఆమె యింకా మీదకి వాలింది. పలికి పోతాడేమో అని నోటికి నోరు అడ్డుపెట్టేసి "మాట్లాడ వద్దు'' అని పెదవులమీద టెలిగ్రాం కొట్టింది.

దానిమీద "వెళ్ళక పోతేనూ పలక్క పోతేనూ మెలాగా?" అన్నట్టు అతను బెదురుతూ చూడగా "గప్ చిప్" అన్నట్టు ఆమె జంకెన చూపులతో అదిలించింది.

తరవాత, "యిక వులకడు పలకడు'' అని ధైర్యం కలగ్గా వొక్క అడుగు యివతలికి వచ్చి, అర అడుగులోనే వెనక్కి తిరిగి, ఔడు కరిచి "పలికినా, లేచినా బాగా జరగదు సుమండీ'' అన్నట్టు తర్జనితో టూకాయించి, మెల్లిగా హార్మోనియం తీసి, ఆరున్నర శ్రుతివేసి శ్రీరాగం వర్ణం యెత్తుకుని మూడో కాలం వాయిస్తూ ఝామ్మని పాడసాగింది.

అటు గండం గడవడం—ముసలమ్మ పాటే అయినా యిటు సంగీతం దొరకడం—దీంతో "భలే—భలే'' అని తల తిప్పేసుకుంటూ చలపతి పొంగిపోయాడు.

అయినా బుచ్చమ్మ తన పని మానలేదు.

మళ్ళీ మళ్ళీ తలుపు కొట్టింది. మొదటికంటే గట్టిగానూ, గబగబా కూడా కొట్టింది. ఇందాకటికంటే బిగ్గరగా కూడా పిలిచింది. రకరకాలుగా కూడా పిలిచింది.

కాని జవాబు లేదు.

పైగా జోగమ్మకి ఆవేశమూ, తన్మయత్వమూ ఎక్కువయినాయి.

దీనికి సాయం "యీ అల్లరంతా యేమిటి చెప్మా ?" అనుకుంటూ వీథిలోకి వచ్చి సోదెమ్మ తొంగిచూసింది.

అక్కడితో సరి.

బుచ్చమ్మ సగం చచ్చిపోయింది.

నిలువునా నీరయిపోయి అప్రయత్నంగా కంకరరాయి జారవిడిచేసింది.

వెంటనే "ఫూసి నీమొహం మండెనుగదే ? నీకళ్లు దించుకుపోయెనుగదే," అని మెల్లిగా తిడుతూ గదిలోకి వెళ్ళిపోయి తలుపులు బిడాయించుకుని నిలువునా కూలబడిపోయిందామె.

## ౨౫

"వున్నే అమ్మోయ్" అంటూ యిలా వెళ్ళి జోగమ్మా అంటూ "విన్నారా పిన్నిగారూ ?" అలా వచ్చి సోదెమ్మా యీ గొడవ అంతా పూర్ణమ్మకి చెప్పేశారు.

అంతా విని "అదేమి పోయీకాలం అమ్మాయిగారూ ? ఎక్కడేనా విన్నారా యిలాంటివి ? పట్టపగలా ? నడివీథిలోనా ? హా—వ్వ". అంటూ నోరు నొక్కుకుంటూ వెళ్ళి పూర్ణమ్మ వెంకటచలంతో చెప్పింది.

"ఆడపుట్టుక పుట్టలేదూ? ఇది మనిషా పశువా ?" అంటూ చర్రుమని లేచాడు వెంకటచలం.

ఆ వుద్ధృతం చూసి చెయ్యి చేసుకుంటాడేమో అని కంగారుపడి, నోట మాట రాకపోగా గభీమని వెళ్ళి పూర్ణమ్మ అడ్డంగా నుంచుంది; కాని అప్పటికప్పుడే తగ్గిపోయి "చలపతి మాట్లాడకుండా వున్నాడా ?" అని అడిగాడతను.

"నేను పలకనివ్వలేదు నాన్నారూ" అని విజయగర్వంతో వెక్కదూకుడ యెదటికి వెళ్ళిచెప్పింది జోగమ్మ.

"ఆ, అదీ మార్గం. అదీ మందు" అంటూ మెల్లిగా మళ్ళీ కూచుని ప్రారంభించాడతను.

"నీకా మాత్రం శక్తి వుంటే యిక లేందేమిటి తల్లీ? "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం" మీ మాట పైకి వినపడ కూడదు. మీరు కోపంగా వున్నట్టు కూడా కనపడ గూడదు. చాలా జాగ్రత్తగా మసులుకోండి, అమ్మా! అంతటికీ ఆధారం చలపతి. అతన్ని విడిచిపెడితే యెవళ్ళకీ యేమీ లేదు. తన పెత్తనానికి నువ్వడ్డు వస్తా వన్న యేడుపే కాని నీ హక్కు యెంతవరకూ వుందో ఆమె గమనించడం లేదు. ఇది మనం తెలుసుకుంటే చాలదు, నీ మామగారు తెలుసుకోవాలి. లోకం కూడా తెలుసు కోవాలి అంటే నువ్వు అందుకు తగ్గట్టు మసులుకోవా లన్నమాట తెలుసా?"

తన మీద వున్న భారం తెలుసుకుని జోగమ్మ నమ్రము రాలు కాగా, పొదివి పట్టుకుని పూర్ణమ్మ ఆమెని గది లోకి తీసుకువెళ్లింది.

వెంకటచలం వాకట్లోకి వచ్చాడు.

చలపతి కవాచీబల్లమీద కూచుని వున్నాడు.

ఇద్దరి చూపులూ కలిశాయి. బెదిరినట్టయి చలపతి వొదిగి కూచోగా, మెల్లిగా వెళ్లి పక్కని కూచుని "యే మిటి ఆలోచిస్తున్నావు?" అని అడిగాడు వెంకటచలం.

"ఏమీ లేదండి"

"అబద్ధం. నువ్వేదో ఆలోచిస్తూనే వున్నావు. అయినా రహస్యం కాబోలు నాతో చెప్పవద్దులే"

"లేదండి లేదండి వూరికేనే కూచున్నాను నేను"

సరే కాని బజారుకి వెళదాం వస్తావా?

"ఆ" అంటూ లేచి నుంచున్నాడు చలపతి.

"బట్టలు వేసుకురా" అంటూ వెంకటచలం కూడా కండువాకోసం లోపలికి వెళ్ళాడు.

"తమలపాకు లయిపోయాయి నాన్నారూ" అంటూ జోగమ్మ యివతలికి రాగా "మీనాన్నతో చెబుతా వేం? కావలిస్తే నీ మొగుడితో చెప్పుకో" అని ముదల కిస్తూ వెనకాల పూర్ణమ్మ వచ్చింది.

ముగ్గురూ వొక్క నిమిషం ఛలోక్తు లాడుకున్నారు. తరవాత "వాకట్లో వెదురు కుర్చీ లుంటే బాగుం టుంది కాదూ? ఒక అరడజను కొనుక్కువద్దాం రా" అంటూ వెంకటచలం ముందు బయలుదేరగా, చంకలు గుద్దుకుంటూ చలపతి, వెనకాలే వెళ్ళాడు.

ఆ వెళ్ళడం బుచ్చమ్మ కళ్ళబడింది.

తానెన్నిమాట్లు పిలిచినా పలకని చలపతి, సంబర పడుతూ మామగారితో వెళ్ళడం, తనని పరాభవించడమే అని కుతకుత లాడిపోయిం దామె.

దానిమీద "సోదెమ్మ వాళ్ళతో కలిసిందేమో" అని అనుమానం కూడా పట్టుకుందామెకి. "పూర్ణమ్మ ముండే దాన్ని వీథిలోకి పంపి వుంటుంది" అని పళ్ళు కొరుక్కుంది.

దీంతో వుడుకుమోత్తనం పెరిగిపోగా, యెవరో గెంటేసినట్టు గభీమని నేలమీద కూలబడి, ముసుగు తన్నుకుని కడుపులో కాళ్ళు పెట్టుకుని పడుకుంది.

ఆ రాత్రి ఆమె ఫలహారం చెయ్యలేదు.

ముందు జోగమ్మ పిలిచింది. తరవాత చలపతి చెప్పాడు. ఇదేమీ యెరగని జగ్గయ్య నాలుగుమాట్లు బలవంతం చేశాడు. అయినా ఆమె లేవలేదు.

## ౨౬

తెల్లవారితే బుచ్చమ్మకి స్నానం.

"ఇంట్లోకి వెళ్ళాటప్పటి కేం గందరగోళం వుడుతుందో?" అనీ, "వాళ్ళేమేమి తలుచుకుని వున్నారో?" అనీ ఆమెకి బెదురు పట్టుకుంది.

మన స్సంతా చీకాకుపడిపోయింది.

అస్తమానమూ కూచునీ, పడుకునీ వుండడంవల్ల

కాళ్ళుకూడా గుసులు పట్టగా, వూసిపోడానికి నాలుగ్గం టలవేళ గోదావరి గట్టుకి బయలుదేరిం దామె.

ఒక ఫర్లాంగు వెళ్ళేటప్పటి కిలాంటిదే వొకామె, గట్టుకింద, రావిచెట్టు వేళ్ళమీద కూచుని వుంది.

"నువ్వొప్పు" డంటే "నువ్వొప్పు" డంటూ అందు కుని యిద్దరూ లోకాభి రామాయణంలోకి వెళ్ళి పోయారు.

సాగతీసుకోడాలూ, బుగ్గలు నొక్కుకోడాలూ, శాబాసులూ అవ్యాహతంగా వెళ్ళిపోసాగాయి.

నాలుగు రోజుల కిందట, యెవరో ప్రౌఢదంపతులు, మసకచీకట్లో గోదావరిలో స్నానం చేశారుట. అప్పుడా మొగుడు ఆ పెళ్ళానికి సబ్బుతో వీపు తోమాడుట.

ఒకావిడ "కొత్తగా వచ్చాడే? ఇంకా వారాలు కుదరలేదుటే పాపం! ఈపూటకి కాస్త అన్నంపెట్టవే" అని ముసలి మొగుడెంత బతిమాలినా ససేమిరా అని, నాలుగైదు రోజు లయ్యాక ఆ మొగుడు వూరికి వెళ్ళగా ఆ పిల్లాడికే పిలిచి భోజనం పెట్టి, నాలుగ్గంటలవేళ ఆ పిల్లాడిచేతే కాఫీ హోటలునుంచి ఫలహారం తెప్పించు కుందిట.

ఒక మొగుడూ పెళ్ళామూ రెండు రోజులకిందట

బజారుకి వెళ్ళారుట. ఒక తువ్వాలు కోసం అతనూ, వొక గజం జాకెట్టు గుడ్డకోసం ఆవిడా జట్కామీద వెళ్ళారుట. బేరాలు కుదరక పదిషాపులు తిరిగారుట. అప్పటి కావిడికి నీరసం వచ్చిందిట. "మళ్ళీ రేపు రావచ్చు, రా, జట్కా యెక్కు" అని మొగుడుట. ముందు కాఫీ హోటలుకి వెడితేగాని జట్కామీద కూడా కూచోలేననీ, అసలు జట్కా యెక్కనే లే" ననీ, పెళ్ళాముట. చివరికి చెయ్యీ చెయ్యీ కలుపుకుని వొక రిలా లాగనూ, వొక రలా లాగనూట; బజారంతా విరగబడి పోయిందిట. ఎక్కడి మనుష్యు లక్కడా యెక్కడి బళ్ళక్కడా ఆగిపోయి బజారు గోడపెట్టేసిన ట్టయిపోయిందిట. చివరికావిడ వొక చెయ్యి విసురుతూ దారి చేసుకుంటూ, వొక చేత్తో మొగుణ్ణి దామోదర్రావు హోటలు దాకా బరబరా లాక్కుపోయిందిట.

ఇలాగ సర్గమీద సర్గా, కాండమీద కాండా చొప్పున వెళ్ళి వెళ్ళి చివరికి, పుట్టింటివారు వచ్చి జోగమ్మకి సామాను కొనడం దగ్గిర నిలిచిపోయింది ఆ రామాయణం.

"కూతు రంటే యెంత ముద్దే వారికీ?" అంది జతకత్తె.

"ముద్దు ముద్దని అంత అబ్బురం యెందుకూ? అవతల

మరెవరేనా వుంటేనా ?" అంటూ గింజుకుంది బుచ్చమ్మ.

"అలా కాదు. నిజంగా మరెవరూ లేరే అనుకో, డబ్బా కావలసినంత వుందనుకో. అయినా అందచం దాలు తెలవ్వద్దూ ? ముద్దుమురిపా లుండవద్దూ ? సాహసం పుట్టవద్దూ? నీమరదలు కావా లన్న వన్నీ కొన్నారు. ఎంత డబ్బయినా వెతికి వెతికి కొన మన్నవే కొన్నారు. ముద్దినుసు వస్తువులూ కొన్నారు.''

"నోరు మూసుకోవే, నాకు పిసాళం యెత్తుకు వస్తోంది. కూతురి కివ్వడం కూడా గొప్పే అంటా వేమిటి నువ్వు ?"

"మీ చలపతి కోరుకున్న కుర్చీ కూడా—"

"ఏమిటీ, మాచలపతా ?" అంటూ వులిక్కి-పడింది బుచ్చమ్మ.

"అవును. ఆకుర్చీకి తగ్గ మేజాబల్ల కూడా కొన్నారు"

"మా చలపతికా ? మా తమ్ముడికా ?"

"అవును. మీ చలపతికే. ఏం, అలా అంటావేం ?"

"అబ్బే, యే మన్నానూ ? ఎందు కంటానూ? తనకి లేకా వాళ్ళని దోసిలి వొగ్గి యాచించడం ?"

"అదేమిటే నీ మొగం యీడ్చా, యెంత వుండినా అత్తవా రివ్వడమూ, అల్లుడు పుచ్చుకోడమూ, —కోరి— అలిగి కూడా రాబట్టుకోడమూ అందం కాదుటే ?''

"అవును లే. ఏదో—వూరికే—"

ఇలా అంటూ బుచ్చమ్మ వుబ్బెత్తుగా లేచి నుంచుంది.

"ఏం, లేస్తా వేమే?" అంటూ తెల్లపోయింది జతకత్తె.

"పోతా"

"అదేమిటే ?"

"వచ్చినవారు వియ్యాలవారాయె. ఏమి కావాలో యేమిటో కనుక్కోవద్దూ ?"

బుచ్చమ్మ యిలా అని బయలుదేరింది.

"ఇంటికి వెళ్ళి వండుతావా, వారుస్తావా ? వాళ్ళకి తోచిందీ, చేతనయిందీ వాళ్లు చేసుకోకుండా, అదనీ, యిదనీ—రమ్మనీ, పొమ్మనీ చక్కట్లు దిద్దడమే కాదూ నువ్వు వీధిగదిలో కూచునీ ? ఇంటిదగ్గిర యెవరూ కన పడక వూసిపోడాని కిక్కడికి వచ్చావే? కాస్సేపు కూచోవే మామ్మా !"

ఆ జతకత్తె ఇలా అంటూ లేచివచ్చి అడ్డంగానుంచుని బతిమాలింది; కాని బుచ్చమ్మ ఆగలేదు. జవాబు కూడా చెప్పలేదు. "అయిన రెండణాలూ పుచ్చుకుని యింత పని చేసిన చలపతి యింకా యేం చేస్తాడో, వాళ్ళేమేమి చేయిస్తారో" అని రవిలిపోతూ— మండిపోతూ—అసలు, ఆ మాటలే వినిపించుకోలే దామె.

౨౮

బుచ్చమ్మ యిలా గోదావరి గట్టుకి బయలు దేరింది, జోగమ్మ, కోవాబిళ్ళలు తెమ్మని చలపతిని అలా బజారుకి పంపించింది.

చిటికెలు వేస్తూ "..........రావాలి. తెలుసా?" అని ఆమె చాలా చురుగ్గానే చెప్పింది; కాని వరదారావు హోటల్లో అవి అయిపోవడంవల్ల దామోదర్రావు హోటలుదాకా వెళ్ళవలసివచ్చిం దతనికి

అక్కడికీ, బుచ్చమ్మ కళ్ళ పడకుండా వుండాలని అతను వాయువేగ మనోవేగాలమీదే వచ్చేస్తున్నాడు; కాని జూపూడివారి కొట్ల దగ్గిర మలుపు తిరగబోతూ వుంటే మరిడమ్మలాగ బుచ్చమ్మ కలుసుకుంది.

నిర్ఘాంతపడిపోయి అతనూ, అగ్గయిపోయి ఆమే నుంచునిపోయారు. ఒక్క క్షణం మిడుతూ మిడుతూ చూసుకుంటేగాని వారు మళ్ళీ ప్రకృతిలో పడలేదు.

"అనుగ్రహం తప్పినట్టుందే?" అంటూ అంకుకుందామె.

"ఇక నేను కనపడను కాబోలు. అవునా?"

మాట్టాడలే దతను.

"అక్కయ్య చచ్చిపోయిన ట్టుందా యేమిట్రా ?"

మొగం కిందికి వంచేసుకుని చెప్పు లప్పగించేశా డతను.

"మాట్లాడ వేం ?"

"................."

"వాళ్ళు వద్దన్నారా యేమిటి ?"

"................."

"మొగం పైకెత్తూ"

"................."

"వినపడ్డం లేదుట్రా ?"

"ఏం ?"

"ఏం జరుగుతోం దేమిటి ?"

"................."

"ఇలా చూడూ"

బెదురుతూ బెదురుతూ చూశాడు.

"అయిపోయిం దయ్యా పని"

కడుపులో రాయిపడ్డ ట్టయిం దతనికి.

"వాళ్ళేదో మంచు రాశారు పెద్దమ్మవారికి. నేనను కుంటూనే వున్నాను. మాయలమారి ముండలు, వాళ్ళెంత కేనా తగుదురు. కాకపోయినా వాళ్ళిక్కడ వుండగానే

నాకీ గ్రహచారం రావాలా ? పండువంటి సంసారం యిక కుక్కలికీ నక్కలికీ అయిపోతుంది కామోసు''

"..................."

"ఓరి చపలవాజమ్మా, యిప్పటి కయినా కళ్ళు తెరు. పెళ్ళాం చెప్పినట్లల్లా వింటూవుంట్రా ?"

"..................."

"అన్నట్టు మొన్నపొద్దున్న నువ్వెక్కడికి వెళ్ళావూ ?"

"నువ్వు ధవళేశ్వరం వెళ్ళ మన్నావు కాదూ ?"

"వెళ్ళావా ?''

"ఆ"

"ఛి ఛీ నీ బతుక్కు బండ లయిపోనూ, పెళ్ళాం కొంగు పట్టుకుని బజారుకి పోయి— ఏం పొగరు పట్టావురా ?''

"ఎవరు చెప్పా రమ్మా నీకూ ?''

"ఇంకా బుకాయించడం కూడానా ?''

"నే నక్కడికే వెళ్ళాను"

ఈమాటలో "యిక నీకు దిక్కున్న చోట చెప్పుకో" అన్న ధ్వని వినిపించిం దామెకి. దాంతో రోషం పెరిగి పోగా పళ్ళు కొరుకుతూ "నోరు ముయ్యి'' అని వురిమింది.

ఇద్దరూ పులుకూ పులుకూ చూసుకున్నారు.

"సరే, నీయిష్టం వచ్చినట్టు తగులడు. దరిద్రగొట్టు పెద్దమ్మల కెంత చేసినా బూడిదలో పోసిన పన్నీరే అయిపోతుంది"

"......................"

"ఎంత కష్టపడ్డానురా నీకోసం ? చివరి కెంత గొంతు కోశావురా నువ్వూ ?"

అతను మెల్లిగా కదిలాడు.

"వెళ్ళిపోతావుట్రా ?"

"......................"

"ఇలా రావూ ?.........నుంచోవూ ?"

ఆగి, మొగం వెనక్కి తిప్పి, "ఏం ?" అన్నట్టు పెంకితనంగా తల ఎగరవేశా డతను. నాలు గడుగులు అతని కేసే వేసి "మించిపోలేదు, ఇప్పు డయినా బుద్ధి తెచ్చుకో" అందామె.

"......................"

"నామాట విను. నే నెందుకు చెబుతున్నానో గ్రహించుకో. ఇదిగో, వాళ్ళ సంప్రదాయం—మంచిది కాదు"

"......................"

"ఆ సాసపాప నిన్నెలాగా ససిపెట్టదు. దానివల్ల పెద్ద తప్పు కనపడేదాకా వోపిక పట్టి తరవాత, మూడో

నాటికి నీకు రెండోపెళ్ళి చేసేస్తాను. బోలెడు కట్నం వస్తుంది నీకు"

అతని గుండెలు కొట్టుకున్నాయి. కాళ్ళలో వణుకు పుట్టింది.

"ఆ పెద్దమ్మ వార్ని సాగనంపేశా వంటే, రంభ ల్లాంటి పిల్లల్ని తెచ్చి గడియలో లక్షమంది నీకాళ్ళమీద పడేస్తారు. సమర్తాడిన పిల్లలే దొరుకుతున్నా రిప్పుడు చూస్తున్నావా ?''

అతనికి వొళ్ళు రణకంపరం యెత్తిపోయింది. అప్రయత్నంగా బయలుదేరాడు.

"వెళ్ళిపోతావేం రా ?" అని కంగారు పడింది దామె. అతనికి వడి యెక్కువయింది.

"ఇదిగో''

అదిగో సందు మళ్ళేశాడు.

వెంటనే బుచ్చమ్మ నడకా కాకుండా పరుగూ కాకుండా రొజుకుంటూ వెళ్ళి, కంఠం నొక్కుకుంటూ "వాళ్ళతో చెప్పావు సుమా యీ మాట......ఏం... వినపడిందా ?...........వోరేయ్ చలపతిగా—వోరి నీ యిల్లు—వోరేయ్—''

మాట సగంలో ఆమె కంఠం బిగుసుకుపోయింది.

## ౨౮

కంభంపాటి వెంకటచయనులుగారి మేడమీద, వసారా గదిలో, వారి చిన్నకోడలితో గవ్వ లాడుకుంటూ వున్న సోదెమ్మ యిదంతా చూసింది.

బుచ్చమ్మ మాట వినపడగానే లేచి, కిటికీ రెక్క చాటున నక్కి, మాట్టాడవ ద్దనీ యెదటికి వెళ్ళవ ద్దనీ స్నేహితురాలికి సన్న చేసి గొడవ అంతా వింది.

"అదేం పోయీ కాల మండీ?" అంటే "యెంత ఘోరం తలపెట్టిందో చూశావా ?" అంటూ యిద్దరూ బుగ్గలు నొక్కుకున్నారు.

తరవాత, సోదెమ్మ, వెనకవీధిని ఇంటి కెగిరిపోయి, కరివేపచెట్టెక్కి, బొట్టుపెట్టి పిలిచినట్టు నూతికి వచ్చి వున్న పూర్ణమ్మని దగ్గిరసా రమ్మని "తెలిస్తే నన్ను పీకేస్తుంది సుమండీ పిన్నిగారూ" అంటూ వుపక్రమించింది.

"ఏమిటో చూసుకున్న వేళావిశేషం అలాంటిదీ. ఒక్క కడుపున పుట్టకపోయినా జోగమ్మ నాకు రెండో చెల్లెలే అనుకున్నాను"

"ఇంతకంటేనా ? మా అమ్మాయి అదృష్టవంతు రాలు. ఇంతకీ ఏదో చెప్పవచ్చారు"

నా కడుపు వ్రెక్క విధంగానే తరుక్కుపోతోంది విన్నప్పణ్ణుంచీనీ. మీతో యేమని చెప్పనూ? ఇదేం శుభవార్త కనకనా?"

"అదేమిటి తల్లీ? ఇప్పుడేం వచ్చింది మామ్మా?"

ఇలా కంగారుపడుతూ పూర్ణమ్మ నూతిగోడకి చేరబడింది. ఏకపుత్రుడు చనిపోగా, యేకపుత్రిక జోగమ్మే సర్వమూ అని ప్రాణాలు నిలుపుకుని వుందామె. ఆ జోగమ్మ విషయంలోనే యిప్పుడేదో అశుభం అనే టప్పటి కామె నవనాడులూ కుంగిపోయి చెవులు గళ్ళడిపోయాయి.

ఇది చూశాటప్పటికి సోదెమ్మకీ కంగారు పట్టుకుంది; కాని చివరి కెలాగో వోపిక తెచ్చుకుని "కొంపతీసి యెవరితో టయినా అన్నారు సుమండీ! నామాట పైకి రానిస్తే నే నిక యీవూళ్ళో బతకలేను సుమండీ" అని అడుగడుక్కీ బెదురుతూనే తాను చూసిందీ, విన్నదీ అంతా పూసగుచ్చినట్టు చెప్పేసి "యేం చేస్తారో మరి? మీ కాపుదలమీద మీరుంచండి. అమాయిక బ్రాహ్మడు జగ్గయ్యమామకీ సంగతి తెలిస్తే గగ్గోలు పడిపోతాడు. బెంబేలు పడిపోతుంది చెల్లాయి కూడా తెలవనివ్వ

కండేం ?'' అంటూ ముక్తాయించి, యిదంతా చెల్లెలికీ మరిదికీ చెప్పడానికింటోకి చక్కాపోయింది.

"ఎంత ఘోరం తలపెట్టావు బుచ్చమ్మ తల్లీ ? నీకు మేమేం విషం పెట్టాము మాయమ్మా ?" అని గుండెలు బాదుకుంటూ పూర్ణమ్మ కూడా యింటోకి వెళ్ళి పోయింది.

౨౬

అరిటి బోదె చాటున కొబ్బరి మొక్కకి పాదు కడుతూ వున్న జగ్గయ్య యీ మాటలన్నీ విన్నాడు.

అతనికి గుండెలు కొట్టుకున్నాయి. కాళ్ళు తేలిపోగా వోపట్టాన లేవలేక, కొంతదూరం కొబ్బరిమట్ట పట్టుకునీ గాని నడవలేకపోయాడతను.

చివరి కెలాగో గాదిసావిడి చేరుకుని, బుజ్జగిస్తూ, మధ్యమధ్య తాను నెత్తీ నోరూ బాదుకుంటూ అడగ్గా "మరే నాన్నా" అని జరిగిందంతా చెప్పేసి చలపతి వణవణ వణికిపోయాడు.

వణికిపోయాడంటే యింకా పూర్తి కాలేదు, వణికి

పోతూనే వున్నాడు. రెండు చేతులుగా నోటిమీద పెట్టు కుని బెదిరిబెదిరి చూస్తూనే వున్నారు.

అలాంటి సమయంలో అతి ప్రయత్నంమీద వుద్వేగం అణుచుకుంటూ వెంకటచలం వచ్చాడు.

చలపతి మరీ కంగారు పడ్డాడు.

"రండి" అని విధిలేక పిలుస్తూ చోటిచ్చి "ఏమి సెలవు?" అని అడిగాడు జగ్గయ్య. "ఇవాళ మీరేమ యినా కొత్త సంగతి విన్నారా?" అని అడుగుతూ కూచున్నాడు వెంకటచలం.

"కొత్త సంగతి అంటే—"

"అంటే మా అమ్మాయి సంగతి"

"ఇప్పుడే విన్నాను. పూర్ణమ్మగారూ నేనూ వెక్క మాటే విన్నాము. చలపతికూడా యిప్పుడే మళ్ళీ చెప్పాడు"

"బావగారిని సమ్మించగలమా?" అనుకుంటూ వచ్చిన వెంకటచలం యిది విని "ఫరవాలేదు" అని స్థిమితపడి నిట్టూర్పుతో ఆవుద్వేగం తగ్గించుకుంటూ గుమ్మంకేసి చూశాడు.

వెంటనే "మేమేం పాపం చేసుకున్నా మన్నయ్యగారూ?" అని గోలపెడుతూ పూర్ణమ్మ వచ్చింది. వెక్కి వెక్కి యేడుస్తూ జోగమ్మ కూడా వచ్చింది.

ఇది చూశాటప్పటికి జగ్గయ్యకి కళ్ళమ్మట నీళ్లు వచ్చాయి. చలపతి కొయ్యే అయిపోయాడు.

వెంటనే జగ్గయ్య తూల్తూ తూల్తూ జోగమ్మ దగ్గిరికి వచ్చి యేడవకమ్మా యేడవకు. ఈక్షణాని కందరూ బాగు న్నాము. లోటేమీ రాలేదు. నిండింటో యేడవకు తల్లీ ! నాకొడుకే నువ్వూ, నువ్వే నా కొడుకువూ. నిన్ను విడిచి పెట్టి మేము బతగ్గలమా అమ్మా" అని గద్గదికవల్ల మరి మాట్లాడలేక చలపతి కేసి చూస్తూ "నాయనా" అని మాత్రం అన్నాడు.

చలపతి కడుపు చెరువయిపోయింది. వెంటనే అతను మండువా వాకట్లోకి వచ్చేశాడు.

తల్లి యింగితం గ్రహించి జోగమ్మ కూడా వచ్చింది.

ఏకాంతంలో అమాయికురా లయిన ఆబాలిక ఖిన్న ముఖం చూశాటప్పటికి అతని మూఢ హృదయం జర్జరిత మయి, ద్రవ మయి నవ్య తేజస్సుతో మళ్ళీ దృఢపడి పోయింది.

వెంటనే ఆమెని ఎత్తుకుని గదిలోకి తీసుకువెళ్ళి తాను కుర్చీలో కూచుని ఆమెని వొడిలో వేసుకుని, వెక్కమాటు గట్టిగా అదుముకున్నాడు.

ఏడుస్తూనే ఆమె యేమిటేమిటో అంది.

ఏడుస్తూనే అతనూ యేమిటేమిటో అన్నాడు.

బాష్పావకుంఠనం వృత్తగించుకుంటూ ఆమె అతని కళ్ళల్లోకి చూసింది. కన్నీటి ప్రవాహం పాయలుపాయలుగా విడగొట్టేసుకుంటూ అతనూ ఆమె కళ్ళల్లోకి చూశాడు.

ఆ లేత హృదయాలు రెండూ మిళితం అయిపోయాయి. దాంతో యిద్దరికీ దుఃఖం తగ్గిపోయింది; కాని వాన వెలిసినా కొంతసేపు చూరునీళ్ళు తప్పనట్టు, ఆ తరవాత కూడా వొక్క క్షణకాలం వారి కనురెప్పల్లోనుంచి బాష్ప బిందువులు రాల్తూనే వుండినాయి.

ఇలాగ జోగమ్మా చలపతీ యివతలికి రాగానే, అక్కడ జగ్గయ్యా, వెంకటచలం రెండు చేతులూ పట్టుకుని "భావగారూ, ఇవి చేతులు కావు కాళ్ళు. చలపతి కుటుంబం మీది కాని పరాయిది కాదు. మీరిదేమీ బయటపెట్టవద్దు. దీనివల్ల మీకేమీ చలించనక్కర్లేదు. చలపతి జీవితంలో యిది చివరి తుపాను. ఇంతకంటే యిదేమీ చెయ్యలేదు. అమ్మా, పూర్ణమ్మగారూ! మీ కింకేం చెప్పనూ? మీ ఆందోళన కంటే నా ఆందోళన గొప్పది. రెండు రోజులు మాత్రం వోపిక పట్టండి. ఏమీ

విననట్టూ, 'యేమీ యెరగనట్టూ వుండండి" అని బతి మాలాడు.

"సరే మరి" అంటూ పూర్ణమ్మ వెంకటచలంకేసి చూసింది. "మీ సెలవుకి బద్ధుణ్ణి" అంటూ వెంకటచలం సమాధానపడ్డాడు.

ఏదో విధంగా గోలపెట్టక మాన రనుకున్న వియ్యా లవా రిలా అతి సులభంగా శాంతించడంవల్ల కొంతబలం కలగ్గా, జగ్గయ్య "మా మేనల్లుడు సూరిశాస్త్రి యింటికి వెళ్ళి వస్తా" నంటూ వీధిలోకి వెళ్ళిపోయాడు.

## ౩౦

చిమ్మచీకటి పడేదాకా బుచ్చమ్మ యింటికి రాలేదు.

అప్పుడయినా అతి రహస్యంగా వచ్చి అతి గుట్టుగా గదిలో ప్రవేశించింది. కొంతసే పయాక, యెదటింటివారి పిల్లని బతిమాలి తీసుకువచ్చి "నాకీపూట పిండి అక్కర్లే" దని తండ్రికి కభురంపి, దీపం వూదేసి ముసుకు తన్నుకుని పడుకుంది.

కాని కళ్ళు పొడుచుకున్నా నిద్ర పట్టలేదు. పైగా,

బలవంతాన కళ్ళు మూసుకున్నా సకలమూ నానా భీభత్సంగానూ కనపడసాగింది.

తా నన్న మాటలన్నీ చలపతి వాళ్ళతో చెప్పేశాడేమో అని బెంగ. తన భవిష్యత్తేమి టని ఆ కుర్దా. అది యెలా తగులడిపోయినా జోగమ్మని సాధించడమూ, పూర్ణమ్మని యేడ్పించడమూ యెలాగా అని ఆందోళన. ఈపని చెయ్యకపోతే చచ్చుపెద్దమ్మకింద కట్టేసి పోదెమ్మ మాటిమాటికీ దెప్పుతూ చంపేస్తుందేమో అని తహతహ.

మొదటి జాము తెలవకుండానే గడిచింది. రెండో జాము నిజంగా ప్రాణాలు కొరికేసింది.

కాని నిద్ర రాలేదు. పొడిక ళ్ళడి పోయాయి.

కొంత సేపటికి గోదావరి వంతెనమీద రెయిలు వస్తున్న చప్పు డయింది. మరికొంత సేపటికి, తొక్క తొక్కిన వూరకుక్కల్లాగ, కోటిపల్లి బస్సులు "మొర్రో" మంటూ మేలుకుని యిటూ అటూ తప్పుకున్నాయి.

అప్పటికి రాత్రి గడిచిపోయిందని ఆమెకి ధైర్యం కలిగింది; కాని తెల్లవారితే యేమవుతుందో అని భయం.

అయితే, ఆగుతుందా? సూర్యుడి కెంత సాక్ష్యం సేకరించుకోవలసి వుందో? ఇడ్లీ సాంబార్లకోసం యెన్ని కడుపులు సకసక లాడిపోతున్నాయో?

ఉండుండి భళ్ళు మని తెల్లవారింది. కళ్ళు విప్పి చూడగా కిటికీ రెక్కల సందుల్లో తెల్లని రేకలు కనపడ్డాయి.

వెంటనే లేచి బుచ్చమ్మ పావుగంటలో గోదావరికి వెళ్ళిపోయింది.

వచ్చిన తరవాత ఆమె నెవరూ పలకరించలేదు. అంతా కట్టు కట్టినట్టూ, వెలివేసినట్టూ కనపడ్డారు.

నిదానించగా జోగమ్మా వోరచూపులే— చలపతీ వోరచూపులే. పూర్ణమ్మా వోరచూపులే. వెంకటచలమూ వోరచూపులే.

పోనీ అనుకుంటే జగ్గయ్య చిన్న చూపు.

దీంతో ఆమెకి వొళ్ళంతా చీమలూ జెర్రెలూ పాకుతూ వున్నట్టనిపించింది. బతుకుమీద రోత పుట్టింది.

ఇలాంటి సమయంలో అప్పలమ్మ వచ్చి, అత్తయ్యగారేరి బాబయ్యా?" అంటూ చలపతి నడిగింది.

దానిమీద "లాం—జముండా, నువ్వూ కూడా నన్ను తీసేపారేశావా?" అని బుచ్చమ్మకి వల్లమాలిన కోపం వచ్చింది అప్పలమ్మమీద; కాని "అత్తయ్య" అనే మాటమీద ఆమెకి తన అత్తవారి యిల్లు మాట జ్ఞాపకం వచ్చింది.

వెంటనే "నూట పాతిక రూపాయల మనోవర్తీ, చక్కని రెండు గదులూ వుండగా యీనరకంలో వుండి యెందుకు కుళ్ళిపోవాలీ ?" అనుకుం దామె.

"నారెక్కల్లో శక్తి వున్నంతకాలమూ నాచిన్న తోటి కోడలికి సాయం చేస్తాను. మామరిది యింటికి బంగారపు గోడలు పెడతాను. దాంతో యిక్కడ "జోగి" కి చెప్పు దెబ్బ కొట్టినట్టవుతుంది" అని మురిసిపోయింది.

## ౩౧

ఉత్తరపింట్లో బుచ్చమ్మ తన బట్టలు సర్దుకుంటూ వుండగా పళ్ళు కుట్టుకోడానికి వుత్తరవసారాలోకి వెళ్ళి వస్తూ వున్న వెంకటచలం చూసి ఆసంగతి పూర్ణమ్మతో చెప్పాడు. పూర్ణమ్మ జోగమ్మతో చెప్పింది. జోగమ్మ చలపతితో చెప్పగా, చలపతి జగ్గయ్యతో చెప్పాడు.

ఇలాగ అందరికీ వుప్పందాటప్పటికి యీ సంగతి బుచ్చమ్మ గ్రహించేసింది.

యథాప్రకారం వియ్యంకు లిద్దరూ వాకట్లో కవాచీ బల్లమీద కూచున్నారు. జోగమ్మ యేదో వూదగా, చలపతి, మంచువా వాకట్లో పచారు మొదలు

పెట్టాడు. "పని తరవాత చూసుకోవచ్చు" ననుకుని, పూర్ణమ్మ, పడమటింటో తలుపు చాటుకి చేరుకుంది.

కాశీమజిలీకథల పుస్తకం పుచ్చుకుని వోరచూపులు చూసుకుంటూ జోగమ్మ దక్షిణపు గది గుమ్మంలో కూచుంది.

ఇలాంటప్పుడు చిన్ని మూట చంకలో పెట్టుకుని మెల్లిగా వాకట్లోకి వచ్చింది బుచ్చమ్మ.

వెంకటచలం జగ్గయ్యకేసి చూడగా అతను మొగం వంచుకున్నాడు.

తరవాత, వొక్క క్షణం నడవ మొగలో నుంచుని, వీధికేసి చూస్తూ బుచ్చమ్మ తండ్రిని పలకరించింది.

"ఎందుకూ ?" అన్నా డతను.

"నాయింటికి వెళ్ళిపోతున్నాను"

"అదేం ?"

ఇలా అంటూ అతను కాళ్లు కిందికి పెట్టు కూర్చున్నాడు.

"కూలిమెతుకులు తప్ప నా కిక్కడేం వుందీ ?"

ఇది విని "ఇప్పటికి నెమరుకి వచ్చిందా చిట్టితల్లీ ?" అనుకుంటూ పూర్ణమ్మ తల పంకించుకుంది. చలపతి మొగిసి పక్కకి చూడగా, జోగమ్మ కనుబొమ్మ లెగర

వేసుకుంటూ "విన్నారా ?" అన్నట్టు పెదవులు కదిపింది.

"ఈసంగతి నీ కిప్పుడే తెలిసిందా ?" అన్నాడు జగ్గయ్య.

"ఇదివరకే తెలుసు"

"మరి యిప్పు డేం వచ్చిందీ కొత్తగానూ ?"

"కన్నడగవద్దు. నీకే తెలుస్తుంది ముందుముందు"

"ఎప్పుడో ముందటి దాకా అక్కర్లేదు, వున్న దంతా యెప్పటి కప్పుడే తెలిసిపోతోంది నాకు. ఏమీ దిగడిపో వడం లేదు"

"ఎన్నయినా కల్పించీ, కవ్వించీ చెప్పేవా ళ్లున్నప్పుడు నీకేం లోటూ ?"

"ఎవ రమ్మా ఆకల్పించీ కవ్వించీ చెప్పేవాళ్ళూ ?" అని నిలవతీసి అడుగుదా మని వాక్యం-అంగలో పూర్ణమ్మ వాకట్లోకి వచ్చింది; కాని వెంకటచలం యింగితం కని పెట్టి వూరుకుంది.

గభీ మని లేచి, గది చివరిదాకా వచ్చి నుంచుని జోగమ్మ పులుకూ పులుకూ చూసింది.

వెంకటచలం "వూరుకుంటారేం ?" అన్నట్టు జగ్గయ్య కేసి కొంచెం కరుగ్గా చూశాడు.

"నిజమే. బంగారబ్బొమ్మవంటి పెళ్ళాం బలికివుండగా

మళ్ళీ పెళ్ళే కల్పించగలవా ళ్ళున్నారు, నాకేంలోటూ?" అని నిరసనగా చూస్తూ అన్నాడు జగ్గయ్య.

పులిక్కిపడిపోయింది పిల్ల; కాని వెంటనే తేరుకుని "ఇంకేం? ఇదిగో వెళ్ళిపోతున్నాను" అంటూ పెుక్క అడుగు ముందుకి వేసింది.

జోగమ్మ చలపతికేసి తీక్ష్ణంగా చూసింది. అదేమిటో యెందుకో గుర్తించుకోలేకపోయాడు; గాని "అయితే నా తాళాలు నా కిచ్చేసి మరీ కదులు"! అని మాత్రం పురిమా డతను.

అక్కడున్నవారికే కాదు, రెండు తరాలలో ఆయింటి కూడా నిజంగా యిది పురుమే. జగ్గయ్య తండ్రి చని పోయాక, ఆయింటో, నేటివరకూ మళ్ళీ అంత ఝూం కారమైన మొగకేక వినపడలేదు.

అది విని జగ్గయ్య కొత్త ప్రపంచంలో పడ్డట్టయి పోయాడు. "ఏమిటీ?" అని తిరగబడి చూశాడు వెంకట చలం. పూర్ణమ్మకి చలపతి మొగంమ్మీద పూర్తిగా కొత్తవాలకం కనపడింది.

ఆ పురుముకి జోగమ్మ నెమిలే అయిపోయింది.

తొడ చరిచి, పంజా చాపుతూ ప్రతి మల్లుడు

"ర్ — రా" అంటూ పిలిస్తే వీరుడైనవాడి కెలా వుంటుందో యీ కేక బుచ్చమ్మ కలా వుంది.

దాంతో, రుస రుస లాడుతూ, మొలలో వున్న తాళాలగుత్తి కైజారు లాగినట్టు తీసి, నిప్పులు కక్కుతూ చూస్తూ వెనక్కి విసిరేసి, మళ్ళీ నిర్లక్ష్యంగా ముందుకి అడుగు వేసిం దామె.

అప్పు డిక బాగుండదని పూర్ణమ్మ ఆమె కడ్డం వెళ్ళి రెక్క పట్టుకుంది. వెంకటచలం కూడా దగ్గిరికి వెళ్ళి "యిప్పు డేం వచ్చిందని వెళ్ళిపోతావూ ?" అని అడిగాడు. ఎదురుగా వుండి తానూరుకోడం బాగుండదని మెల్లిగా గదిలోకి జారుకుంది జోగమ్మ.

ఇక వూరుకుంటే మాట మీద పడిపోతుం దని, జగ్గయ్య, మాట వుళాకోపోయాడు; కాని బుచ్చమ్మ అందర్నీ విదాళించి కొట్టి "అందరి పాలూ పొంగాయి కదా ?" అంటూ మూట విడిపించుకుంది.

దాంతో జగ్గయ్య మనస్సు పూర్తిగా విరిగిపోయింది. "వెళ్ళిపోనివ్వండి" అంటూ వెనక్కి తగ్గేశా డతను.

"తొందరపడకు. నా మాట విను. అల్లరిపడిపోతావు సుమా" అంటూ వెంకటచలం కూడా తప్పుకున్నాడు. పూర్ణమ్మ "వెనక్కి రావమ్మా వెర్రిపిల్లా" అంది.

కాని, బుచ్చమ్మ, యెవర్నీ, యెంకకూ లెక్క చెయ్యక "ఎంత లేసి ముండ లయినా వున్నారు భూమ్మీద. నా వుసురు తగలదూ? ఈపీనుగులు ముందుకి వస్తారా?" అంటూనే వృక్క అంగలో వీధిలోకి వెళ్ళిపోయింది.

వాకట్లో యిది యిలా జరుగుతూ వుండగా, గభీ మని గదిలోకి చక్కా వెళ్ళి, లోగుమ్మంలో నుంచుని చెవులోర చేసుకుని వున్న జోగమ్మని "చూసుకో నా మజా" అంటూ అమాంతంగా యెత్తి కుదేసి, మళ్ళీ వాకట్లోకి చక్కా వచ్చాడు చలపతిరావు.

## ౩౨

రెండుమూడు నిమిషాల సే పెవరూ అధరస్పందం అయినా చెయ్యలేదు.

తరవాత జగ్గయ్య "భావగారూ! నా అదృష్టం యిలా వుంది. ఏం లేదని యేం పోయిం దని యీ అల్లరి? కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది, యేం చెప్పకోనూ? ఆవిడ నన్ను విడిచిపెట్టేసి వెళ్ళిపోయినా యిక నా కేలోటూ వుండ దనుకున్నాను; కాని యిది అంత కంటే యెక్కువది. అంతా చూశారు కదా? ఇక మీకు

నే నేమీ చెప్పనక్కర్లేదు. వెంటనే యీవూరు బదిలీ చేయించుకోండి" అన్నాడు.

దానికి వెంకటచలం "ఈదురదృష్టం మాది కాని మీదికాదు. ఏం నలుగు రున్నా రనీ? మాచిట్టితల్లికి ఒక్కగా నొక్క ఆడబడుచు. ఆమె కేనా ఒక్క తమ్ముడు. ఆపైని తల్లి లేకపోవడం. మాఅమ్మాయిని దిద్దుతూ తాను పైనుండి చక్రం తిప్పుతూ వుంటే యెంత బాగుండిపోవునూ!" అనగా, పూర్ణమ్మ మండువా దాటి వచ్చి "మేమీ వూరికి బదిలీ చేయించుకున్నా మాయింటో మామానాన మేమూ, మీయింటో మీ మానాన మీరూవుండి,వస్తూపోతూ వొకళ్ళకి వొక రాసరా అవుతూ వుంటే యెంత అందంగా వుండు నన్నయ్యగారూ? తనకి మే మేమి లోటు చేశామూ? ఏమి అపకారం మాత్రం చేశామూ? "అడుగు పెట్టి అత్తగారికి నూక లేకుండా చేసిం" దని నాటికి నాడూ నా కూతుర్ని అల్లరిపెట్టింది. "కాపరానికి రావడం తరవాయిగా ఆడబడుచుని లేవ గొట్టిం'' దని నేటికి నేడూ గోలపెడుతుంది. మా కీ ప్రారబ్ధం యేమిటండీ? పోనీ, మాపిల్లవల్ల యేమేనా తప్పుంటే, మేము దగ్గిరే వున్నాము కదా, వివరించి చెప్ప గూడదు టండీ? పోనీ మీతో చెప్పి మమ్మల్ని "ఛీ"

అనిపించకూడదు టండీ? అదీ కాక : మేమిక్కడ వుండ గానే యిలా చెయ్యాలా?" అంటూ చాలాచాలా నొచ్చుకుంది.

జగ్గయ్య వారిద్దరికేసీ తిరిగి "వూరుకోం" డన్నట్టు మొదట తలా, చెయ్యీ వూపాడు. తరవాత చలపతిని చూసి "యేం నాయనా, తాళాలు తీసుకున్నావు కాదేం? విసిరి పారేసిందని కోపమా?" అంటూ తాళాల గుత్తి తీసి "నాయనా, ఇది నాది కాదు నీయిల్లు. యజమానివి నువ్వు. ఇవిగో నీ తాళాలు నువ్వు పుచ్చుకో; కాని నువ్వు అమాయికుడవు. ఇంకా వ్యవహారజ్ఞానం సంపాదించు కున్నావు కాను. ఇప్పుడేనా జాగ్రత్తపడు. నీమామగారు సరసులు, సకలమూ తెలిసినవారు. పైగా, నాలుంగే నీమీందే ప్రాణాలు పెట్టుకుని వున్నవారు. వారు చెప్పి నట్టు విని బాగుపడు. ముందు తాళాలు నీ పెళ్లాం దగ్గిర దాచు. మీ రిద్దరూ కలిసి పెత్తనం చేసుకోండి. నాకు కావలసింది యిక గుప్పెడన్నం" అంటూ గుత్తి కొడుకు చేతి కిచ్చాడు.

ఒక్క క్షణం యెవరూ మాట్లాడలేదు.

తరవాత "వస్తానని నమ్మబలికి మాసూరిశాస్త్రి సమ

యానికి వచ్చాడు కాదు" అంటూ జగ్గయ్య వీథిలోకి వెళ్ళిపోయాడు.

"ఏం చెప్మా అందరూ వూరుకున్నారూ ?" అనుకుంటూ జోగమ్మ వాకట్లోకి వచ్చింది.

వెంటనే "నీ దగ్గిర వుంచు" అని తాళా లామె చేతిలో పెట్టాడు చలపతి. తల్లి యింగితం కనిపెట్టి జోగమ్మ "నా దగ్గి రేమిటండీ? నా కేమి తెలుసునండీ? మీ దగ్గిరే వుంచండీ" అని చెబుతూ మళ్ళీ యిచ్చెయ్యబోయింది; కాని చలపతి అత్తగారికేసీ, మామగారి కేసీ చూస్తూ "వద్దు నీ దగ్గిరే వుండనియ్యి" అని చెప్పి, వెళ్ళి, మామగారికి దగ్గిరగా బల్లమీద కూచున్నాడు.

దానిమీద వెంకటచలం అందుకుని "నీ మామగారు నీ కిమ్మన్నారు, నీ మొగుడు నీ కిచ్చాడు. అంటే నీ మీద యెంత పూచీ వుందో తెలుసుకున్నావా ? కనుగలిగి మసులుకోమ్మా" అని కూతురికి చెప్పి "వెర్రిపిల్ల, తన ధోరణేకాని వొకళ్ళమాట వినిపించుకోదు. కన్న తండ్రికంటేనూ, తోడబుట్టిన తమ్ముడి కంటేనూ, మరుదులు వుద్ధరిస్తారా ?" అంటూ చలపతికేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఎంత పని చేసిం దోయీ మీ అక్కా ?" అంటూ

మెల్లిగా బల్లదగ్గిరికి వెళ్ళి పూర్ణమ్మ కూడా చలపతిని పలకరించింది.

## 33

ఎగిరెగిరిపడుతూ వుంటింటి దొడ్డోకి వెళ్లి, పక్కయింటి కేసి చూస్తూ "అక్కయ్యగారూ" అంటూ ఆత్రంగా పిలిచింది జోగమ్మ.

జవాబు రాలేదు.

"సోదెమ్మక్కయ్యగారూ" అని మళ్ళీ కొంచెం, గట్టిగా పిలిచిందామె.

"ఆ"

"ఎక్కడున్నారండీ?"

"వచ్చె వచ్చె.........చెల్లాయీ"

"నేనే నండీ"

"ఏం తల్లీ?"

"నేను రమ్మన్నప్పుడు మాయింటికి వస్తానన్నారు మీరు. ఇదిగో నేనే పిలుస్తున్నాను మరి. తొరగా—నుంచున్నపాళంగా రావాలి"

సోదెమ్మకి, జోగమ్మ పిలుపులో కంటే చిటికెల్లో ప్రేమా, ఆదరమూ యెక్కువగా కనపడ్డాయి;

అందు కానందిస్తూ "కందుకూరివారి యింటి యజమానురాలే నన్ను పిలుస్తున్నదీ ?" అని అడిగిందామె.

"ఫ్రౌ—క్ష దెబ్బని"

"ఎన్నాళ్ళ కెన్నాళ్ళకీ? ఏం జరిగిం దేమిటి చెల్లీ ?"

"భామ వెళ్ళిపోయిం దండీ"

"నిజం—గ్గా ?"

"నిజంగానే నండీ"

"ఎక్కడి కమ్మా ?"

"అత్తవారింటికి"

"అమ్మో, దీని కడుపుడక, యెంత సేపయిందీ ?"

"ఇప్పు డిప్పుడే వెళ్ళింది. ఈపాటికి మళుపు తిరుగుతుం దండీ"

"అదేమి టమ్మా ?"

"అక్కడ రెండు గదులు కేటాయించారు ట కాదూ తన కోసం ?"

"అయితే ?"

"అక్కడ వుంటుం దన్నమాట"

"మరిదిగారి యింటో వంటలక్క—"

"అ—న్నమాట. మీరు సరిగ్గా చెప్పా రకయ్యగారూ"

"ఇలాంటివాళ్ళ బతుకు చివరి కంతే; కాని చోద్యం గానే వుంది చెల్లాయీ''

ఈసమయంలో పూర్ణమ్మ గబగబా వచ్చి "తాళాల మాట చెప్పకుసుమా ఆవిడతోటీ'' అంటూ కళ్ళు తిప్పుకుంటూ మెల్లిగా చెప్పింది.

"అలాగే'' అన్నట్టు తల వూపింది జోగమ్మ.

తన మాట మీద మళ్ళీ మాట రాకపోగా "అస, లిప్పు డేం వచ్చి యింత గొడవ పెరిగింది చెల్లీ?" అని అడిగింది సోదెమ్మ.

"కథ అంతా చెబుతా, నలా రండి తొరగాను'' అని బదులు చెప్పి జోగమ్మ వాకట్లోకి వుడాయించింది.

"అమ్మాయిగారూ'' అంటూ పూర్ణమ్మ అందుకుంది.

"పిన్నిగారూ"

"విన్నారా?"

"చూశారా?''

"ఎంత రాగతనం వుంది మామ్మా!''

"మీ రేం చూశారు పిన్నిగారూ?''

"అలా వస్తున్నారు కారూ?''

"వస్తున్నా''

"నేనూ రానా ?" అని సోదెమ్మ చెల్లెలు.

"వస్తే రా" అని సోదెమ్మ.

"వారెవరూ, చిన్నమ్మాయా ?" అని పూర్ణమ్మ.

"అవునండీ, మా రుక్కమ్మ".

"తీసుకురండి"

"తీసుకువస్తున్నా........తొరగా కదలాలి చెల్లీ తొరగా"

"వీధిలోనుంచే రండి"

"అలాగే, యింకేం భయమూ ?"

స్వాగతసత్కారం జరపడానికి పూర్ణమ్మ వాకట్లోకి బయలుదేరింది.

హెర్, హైనెస్, మహారాణీ సాహేబా, శ్రీ శ్రీ శ్రీ పీసపాటి సోదెయ్యమ్మా దేవిగారి ప్రయాణం సందర్భంలో, రాజలాంఛనంగా, వంటింటి రెక్కతలుపులు రెండూ రెండు ఫిరంగులు వేశాయి.

౧౯-౩౧ మార్చి
(సవరణలతో)

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

సంపుటాలుగా అచ్చవుతున్నవి

సంపుటం ౧కి పేజీలు ౧౨౫-౧౫౦ వెల ఆరేసి అణాలు

మొదటి సంపుటం ౧౪౩ పేజీలు ౦—౬—౦

రెండో సంపుటం ౧౪౬ పేజీలు ౦—౬—౦

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

విడివిడిగా అచ్చయివున్నవి

| | |
|---|---|
| ౧ గూడుమారిన కొత్తరికం | ౦—౨—౦ |
| ౨ కలంపోటు | ౦—౨—౬ |
| ౩ తల్లిప్రాణం | ౦—౨—౬ |

ఇకముందు విడివిడిగా అచ్చు వెయ్యబడవు. కాలక్రమాన యీమూడూ సంపుటాలు చెయ్యబడతాయి.

## శాస్త్రిగారి గ్రంథాలు మరికొన్ని

| | |
|---|---|
| ౧ రక్షాబంధనం డిటెక్టివు నవల | ౧—౦—౦ |
| ౨ శ్మశానవాటిక ,, | ౦—౮—౦ |
| ౩ వారకాంత నాటకం | ౦—౪—౦ |
| ౪ విజయనగర రాజుల కథలు | ౦—౨—౦ |
| ౫ చిత్తూరు రాజుల కథలు | ౦—౩—౦ |

కలాభివర్ధనీ పరిషత్తు — రాజమండ్రి

# కొద్ది రోజుల్లోనే

మేము శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారివే కాక ఇతర పండిత, కవులవిన్నీ, నాటకములు, చిన్నకథలు, నవలలు, విమర్శనములు, ఖండకావ్యములు, చరిత్రలు, సాహిత్య గ్రంథములు, పరిశోధక గ్రంథములు మొదలైనవి ప్రకటించడం ప్రారంభిస్తాము.

గ్రంథకర్తల సహకారం కోరుతున్నాము.

కలాభివర్ధనీ పరిషత్తు
రాజమండ్రి



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B143 |
| పుస్తకం పేరు | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్న కథలు 02 |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 153 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | narma |
| పేజీలు విడదీసినది | narma |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |